# వారసుడు

[సాంఘిక నాటకం]

రచన:

సువర్ణశ్రీ

వి. జి. యస్ పబ్లిషర్స్,
అమలాపురం.

వెల: రు 2/-

పాత్రలు :-

1. శాస్త్రిల శరభయ్య :- 60 ఏళ్ళకుపైబడ్డ ముసలివ్యక్తి ఆస్తిపరుడు.

2. గీతాల గోవిందయ్య :- శరభయ్యగారి స్నేహితుడు పురోహితుడు.

3. చిరంజీవి :- 20 ఏళ్ళ యువకుడు.

4. అడ్డదారుల అనంతయ్య:- శరభయ్యగారి దూరపుబంధువు 50 ఏళ్ళ వయస్సు.

5. తికమకల తిరపతిశాస్త్రి:- శరభయ్యగారి దూరపు బంధువు 40 ఏళ్ళ వయస్సు.

6. బురదగుంటల వీరవరహాలు:- శరభయ్యగారి దూరపు బంధువు 25 ఏళ్ళ వయస్సు.

# వారసుడు

అంకితం.

మృతులై – స్మృతులే మిగిల్చి పోయిన
సోదరి త్రిపురారి శేషారత్నం
సోదరుడు త్రిపురారి అంబయ్యలకు
ప్రేమపురస్సరంగా

అన్నయ్య
"సువర్ణశ్రీ"

ప్రదర్శనకు చిరునామా:
"సువర్ణశ్రీ"
యానాం.
(Via) కాకినాడ.

# "వారసుడు"

## (సాంఘిక నాటకం)

రచన : సువ్వరశ్రీ

## —: 1వ రంగం :—

శాస్త్రుల శరభయ్యగారి ఇంటిలో ఒక వసారా. ఒక పురాతన విశాలగృహానికుండే రంగాలంకరణ. ఆధునిక నాగరికతా చిహ్నాలేవీ అక్కడ కనిపించవు. అక్కడక్కడ దేవుళ్ళ పటాలు అలంకరించబడి ప్రాతబడి వుంటాయి. రంగానికెదురుగా శ్రీకృష్ణుడు అర్జునునకు భగవద్గీత బోధించే చిత్రం మాత్రం కొత్తవచ్చినట్లుగా, బాగా కనిపిస్తూ వుంటుంది. ఆ ఇంట్లో ఆడవారులేని లోటు అంతటా అగుపిస్తూ ఉంటుంది. ఎంతసంపద వున్నప్పటికీ సరియైన సంస్కారానికి నోచుకోని గృహంలా వుంటుంది. అపరిశుభ్రంగా వుంటుంది. ఏదో "మొనాటనీ" ఆ ఇంటిని పట్టుకు వేళ్ళాడుతున్నట్లు అగుపిస్తూ వుంటుంది.

తెర లేచేసరికి గీతాల గోవిందయ్య భగవద్గీతా పారాయణం చేస్తూ వుంటాడు. శరభయ్య వింటూ వుంటాడు. ఇద్దరూ క్రిందకూర్చుని వుంటారు. గోవిందయ్య సామాన్య బ్రాహ్మణ వేషంలో వుంటాడు. శరభయ్య సామాన్య దుస్తులతో భక్తిశ్రద్ధలుట్టిపడే ముఖంతో గోవిందయ్య జ్ఞానబోధ వింటూవుంటాడు.

గో:— చాతుర్వర్ణ్యం మయాసృష్టం
గుణకర్మ విభాగశః
తస్యకర్తారమపిమాం
విద్ధ్యకర్తారమ వ్యయం.

ఆహాహా! ఎంతచక్కగా శెలవిచ్చాడు శ్రీకృష్ణుడు.

శే:— గోవిందయ్యగారూ! జాతికి జన్మ కారణం కాదంటారా?

గో:— "మానవుల యొక్క గుణంబులను, కర్మలను బట్టి మాత్రమే నాల్గు వర్ణంబులును నాచే సృష్టింపబడినవి" అని భగవంతుడు స్పష్టంగా చెపుతుంటే— జన్మచేతనే వీడు బ్రాహ్మణుడు, వీడు శూద్రుడు అని వర్ణనిర్ణయం చేయడం మూర్ఖత్వం కాదంటారా?

శే:— అయితే— గోవిందయ్యా, జాతికి జన్మ కారణం కాదంటావా?

గో:— కాదు. మనం మూర్ఖులమై భగవంతుని బోధను వినలేక పోతున్నాం.

శే:— గుణ కర్మలనుబట్టి వర్ణాలు నిర్ణయించడం ఎలాసాధ్యం గోవిందయ్యగారూ?

గో:— ఎందుకు సాధ్యంకాదు? బ్రాహ్మణ ధర్మాలను, ఆ వృత్తినీ అవలంభించేవాడు బ్రాహ్మణుడు. వైశ్యధర్మాలను,ఆవృత్తినీఅవలంభించేవాడు వైశ్యుడు. ఎవరివృత్తి ధర్మాలను బట్టి వారి జాతిని నిర్ణయించడం ఎందుకు సాధ్యంకాదు?

శ:— అయితే, జన్మచేత జాతుల్ని నిర్ణయించడం పూర్తిగా పొరబాటేనంటారా ?

గో:— ముమ్మాటికీ.

శ:— ఇది ఎలా జరిగింది ?

గో:— మన అజ్ఞానం వలన...

శ:— ఎన్నో తరాలుగా, జాతిని జన్మచేతనే నిర్ణయించే సాంప్రదాయం మనలో వుందికదా. అయితే మన ముందుతరాలవారందరూ అజ్ఞానులేనంటారా ?

గో:— అంతటి సాహసం నాకు లేదు. అయినా ఈవిషయం లో మాత్రం ...

శ:— మనపూర్వులు పొరబడ్డారు ?

గో:— కాకపోతే మరేంవిటి! శాస్త్రజ్ఞానమూ, గీతా రహస్యమూ తెలియని ఎవరో స్వార్థపరులు నెలకొల్పిన ఈ దుష్టసాంప్రదాయానికి మనమూ, మన ముందు తరాలవాళ్ళమూ లోనయిపోయాం, అంతే.

శ:— ఆలోచించిచూస్తే మీమాటలు...

గో:— అబద్ధం కాదనిపిస్తున్నాయి, అవునా ?

శ:— ఆఁ

గో:— శరభయ్యగారూ మన మతాన్ని మనం అర్థంచేసుకో డానికి మనకు భగవద్గీత ఒక ప్రమాణ గ్రంథం. ఇందులో జాతుల విషయమై ఇంతస్పష్టంగా, సందేహ రహితంగా వ్రాసివుండగా మీకింకా సంశయ మెందుకండీ ?

శ:— అయినా సాంప్రదాయం...

గో:— ఎలాకాదనేది అంటారు. ఒకనాడు సహగమనం మన దేశంలో చాలాకాలంగా సాంప్రదాయంగా వుండేది. అందువలన అది తప్పుకాదనగలమా? నిషేధించకుండా వుండగలమా?

శ:— ఇంతకూ ఇది ఒక మూఢాచారమంటావ్?

గో:— అంతే. అన్ని మూఢాచారాలవలె ఇదికూడా ఒకనాడు కాలగర్భంలో కలసిపోకతప్పదు.

శ:— ఏమిటో గోవిందయ్యా, నీవెంత చెప్పినా...

గో:— మీ మనస్సు మారలేదంటారు.

శ:— ఎలా మారుతుంది చెప్పు. మా పూర్వీకులందరూ నిత్యాగ్నిహోత్రాలతో— నిరంతర నియమ నిష్ఠలతో...

గో:— మెలగారు, కాదనను.

శ:— అంతేకాదు, శాస్త్రవిరుద్ధమైనదేదీ ఎంతమాత్రం...

గో:— ఆచరించేవారు కాదు.

శ:— వారికి నేను వారసుణ్ణి. వారి భావాలు నాలో అణువణువునా జీర్ణించిపోయాయి.

గో:— అందుకనేగా మిమ్మల్ని శాస్త్రుల శరభయ్యగారన్నది.

శ:— ఏమైనా అననీ, మన పెద్దలేర్పరచిన సాంప్రదాయాన్ని...

గో:— కాదనడం మీకు సాధ్యంకాదంటారు.

శ:— అవును. అంతే.

గో:— అయితే ఒక్కమాట...

శ:— ఏమిటది ?

గో:— మన హిందూమతానికి ప్రమాణగ్రంథంగా భగవద్గీతను ఒప్పుకొంటారా ?

శ:— ఊఁ

గో:— సర్వకాలీన సత్యాలైన ఈ గీతావాక్యాలకంటె మనకు సాంప్రదాయం ముఖ్యమంటారా ? ఆలోచించండి.

శ:— అయితే ఈసాంప్రదాయం ఎందుకుఏర్పడినట్టు ?

గో:— సాంప్రదాయమంటూ వుందికదా అని దానిని కొనసాగించడంకాదు మనంచేయవలసినపని.

శ:— మరి ?

గో:— సాంప్రదాయాల మంచిచెడ్డల్ని హేతుబద్ధంగా ఆలోచించాలి. మంచివి కొనసాగించాలి. చెడ్డవి విడనాడాలి.

శ:— చెడ్డసాంప్రదాయాలు కూడా మనలో వున్నట్లు నేనొక్కనాడూ...

గో:— అనుకోనివుండరు. ఒక్క మనలోనేకాదు. ప్రపంచమంతటా ఇటువంటి సాంప్రదాయాలున్నాయి. హేతువాదంతో మంచివి స్వీకరించి, చెడ్డవి నిరాకరించడం విజ్ఞుల లక్షణం.

శ:- నీవేమైనా అను గోవిందయ్యా, సనాతన వాదాన్ని విమర్శించడం. . .

గో:- మీరు సహించలేనంటారు.

శ:- అవును.

గో:- మిమ్మల్ని చూస్తే నాకొక కథ జ్ఞాపకంవస్తోంది.

శ:- ఏవిటది ?

గో:- పూర్వం ఒక పెద్దమనిషి ఉండేవాడట. వాడికి పిల్లులపై ప్రీతి. అంచేత వాడి ఇంటినిండా పిల్లులు దినదిన ప్రవర్ధమానంగా తిరుగుతూ వుండేవట. పితరులకు శ్రాద్ధ కర్మలూ అవీ పెట్టేసమయంలో పిల్లులు ఆహారపదార్థాలను మైలపరస్తూవుండేవి. ఇదిపనికాదని అతడు అటువంటిసమయాల్లో వాటిని దొడ్లో ఒకచెట్టుకు కట్టిపెట్టి ఆశ్రాద్ధవిధులు నిర్వర్తించేవాడట.

శ- పాపం.

గో- కొన్నాళ్ళకు ఆ పెద్దమనిషి చనిపోయాడు. క్రమంగా ఆకుటుంబంలో పిల్లుల్ని పెంచే అలవాటూ తప్పిపోయింది. కాని ఒక్కటిమాత్రం శాశ్వతంగా నేటి వరకూ సాగుతూ వుండిపోయింది.

శ- ఏవిటది ?

గో- అతడు నెలకొల్పిన సాంప్రదాయం.

శ- అంటే ?

గో- పిల్లుల్ని దొడ్లో చెట్టుకుకట్టి శ్రాద్ధవిధులునిర్వర్తించడం.

శ— భేష్. ఇది వారికుటుంబంలో వంశపారంపర్యంగా నిల్చిపోయిందన్నమాట.

గో— మరేమనుకొన్నారు ? ఆసమయానికి వారి ఇంటిలోను, గ్రామంలోను పిల్లులు లేకపోతే— పొరుగిండ్లకు, పొరుగూర్లకు సైతం వెళ్ళి పిల్లుల్ని తెచ్చి మరీ జరిపిస్తారు శ్రాద్ధవిధి. ఇది కేవలం మూఢాచారం కాదంటారా ?

శ— ముమ్మాటికీ మూఢాచారమే.

గో— మనం ఆచరించే ఆచారాలుకూడా చాలావరకు ఇంతే. ఏవో కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ఏర్పడిన పద్ధతులకు మనం బానిసలమైపోయాం. అర్థంలేని ఈ ఆచారాలను కొనసాగించడం అవివేకం కాదంటారా ?

శ— కాదనలేను గాని మన ఆచారాలన్నీ ఈ "పిల్లులకర్మ" వంటి వేననిమాత్రం. . .

గో— మీరు అంగీకరించరు. పోనీలెండి. కొన్నిఅయినా మన ఆచారాల్లో ఇటువంటివి ఉన్నాయని అంగీకరించారు. వాటిని విడనాడాలా ? అక్కర్లేదా ?

శ— మూఢాచారాలు విడనాడాలిమరి.

గో— మన కులతత్వం, మత తత్వం కూడా ఇటువంటివే. గుణకర్మ విభాగాన్ని అనుసరించి కులాలూ, భగవంతుడొక్కడే అయినా అతన్ని చేరే పలువిధమార్గాలుగా మతాలూ ఉద్భవిల్లాయి. వీటిలో హెచ్చు తగ్గు

శ— పొరబాటంటావు.

గో— ముమ్మాటికీ.

శ— గోవిందయ్యా, నీవెంత ఘోషించినా నామనస్సు మాత్రం ఈవిషయంలో...

గో— మారదంటారు.

శ— అవును.

గో— ఒక్క మీ మనసేకాదు. మీవంటివారి మనసులెన్నో ఇంకా మారడంలేదు. దేశకాలావధుల్ని గుర్తించడం లేదు.

శ— అంటే నీ ఉద్దేశం?

గో— బూజుపట్టిన సనాతనభావాల అడ్డుగోడల మధ్యనుంచి అభ్యుదయకాంతుల్ని చూడలేకపోతున్నారు. ఆ అడ్డుగోడల్ని పడగొట్టుకొని ముందుకు దూకలేకపోతున్నారు.

శ— అయితే గోవిందయ్యా, ఈమతాలూ, కులాలూ మంట గలసిపోతే తప్ప అభ్యుదయం సిద్ధించదంటావా?

గో— అది నా అభిప్రాయంకాదు.

శ— మరి?

గో— అభ్యుదయానికి అవరోధంగా నిలుస్తున్న మన ఆచార సాంప్రదాయాలను సంస్కరించుకోవాలంటాను.

శ— అనాదిగా వస్తున్న ఆర్ష సాంప్రదాయాలకు సంస్కారమా? అందునా అల్పజ్ఞులమైల మనమాసంస్కరించేది?

గో_ అవును, మనమే.

శ_ అందుకు మనకు అన్వాతలేదు.

గో_ అదే పొరబాటు. ఆసాంప్రదాయాలను, ఆయా దేశ కాల పరిస్థితులకు అనుకూలంగా సృష్టించుకొన్నది మనం. ప్రస్తుత దేశకాలపరిస్థితులకు అనుకూలంగా సంస్కరించుకోవలసిందికూడా మనమే. అందుకు మనకు అన్వాతలేదనుకోవడం ఒక ఆత్మవంచన. ఆలోచించండి, అయినా ఈకాలంలో బ్రాహ్మణధర్మాలను తూ చా ఎవరు పాటిస్తున్నారు చెప్పండి ?

శ_ ఎవరూ పాటించడంలేదంటే నేను నమ్మను.

గో_ లోకం అంతా మీలాగే స్వచ్ఛంగా వుందనుకొంటారు మీరు.

శ_ కాక ?

గో_ ఎంత మలినమైపోయిందో మీరూహించలేరు. మా వూరిలో ఒక శాస్త్రిగారుండేవారు. బ్రాహ్మణ్యం మూర్తీభవించిన శుద్ధ శ్రోత్రియుడు. ఆచారపరాయణత్వంలో-అనుదిన జపానుష్ఠానాలలో ఆయనకాయనే సాటి. అయితేనేం చీకటిపడితేచాలు, తన పొలంలో పనిచేసే పాలేరుపిల్లతో ప్రేమకలాపం సాగించేవాడు.

శ_ శివశివా !

గో_ చూసారా ! మేడిపండు సామెతగా మన బ్రాహ్మణ్యం నానాటికీ దిగజారిపోతూంది. సనాతనత్వపు ముసుగు

లో ఎంతో నైతికపతనం తాావుచేసుకోంటూ వుంది ఈ నైతికపతనం నేనొక-చోటకాదు, పలుచోట్ల చూసాను. నామనస్సు మార్చుకోన్నాను. పూర్వం నేనూ మీలాగే చాందసునిగా వుండేవాడిని. చాందసత్వంలోని సంకుచితత్వంకంటె అభ్యుదయవాదంలోని సంస్కారశీలం మంచిదని గుర్తించాను.

శ- ఏంవిటో గోవిందయ్యా, నీమతం నీది. నామతం నాది.

గో- (నిట్టూర్పు) హు! అర్థంలేని మీ వ్యర్థసాంప్రదాయాల పట్టింపువలననేకదా నేను మీజీవితం ఈ అధోగతి పాలయింది.

శ- (నిట్టూర్పు) హూ!

గో- ఈచివరిదశలో మీకుమారుడే మీవద్దనుంటే నేడు మీజీవితం ఎంతహాయిగా వుండేది!

శ- (మరొక నిట్టూర్పు) హూ!

గో- నిజానికతడు చేసిన తప్పేంవిటి?

శ- అంతకంటె వేరే ఏంచేయాలి?

గో- అంటే?

శ- కుటుంబగౌరవాన్ని, సాంప్రదాయాన్ని విడనాడి మనకులం కానిదాన్ని, మనమతం కానిదాన్ని...

గో- పెండ్లాడాడు. అంతేకదా?

శ- అంతకంటె భ్రష్టత్వం, పతనం వేరేవుందా?

గో- ఇది పతనంకాదు శరభయ్యగారూ.

శ_ మత్తేమిటి ?

గో_ నవయుగానికి నాందీప్రస్తావన.

శ_ (కోపంగా) గోవిందయ్యా

గో_ ఆవేశపడకండి శరభయ్యగారూ. జీవితంలోని అన్ని అనర్థాలకు మూలం ఈ ఆవేశమే.

శ_ (కోపంగా) గోవిందయ్యా, నీకే ఒక కొడుకు వుంటే_ వాడే ఒక క్రైస్తవకన్యను వివాహమాడివుంటే...

గో_ మనసారా ఆశీర్వదించి వుందును.

శ_ గోవిందయ్యా

గో_ అవును శరభయ్యగారూ. నేను అంతేచేసివుందును. అర్థంలేని పట్టింపుతో పసిహృదయాలను నుసిచేయడం నాకు సాధ్యంకాదు.

శ_ అయితే నేనుచేసిన పని తప్పంటావా గోవిందయ్యా ?

గో_ ముమ్మాటికీ తప్పే. సాంప్రదాయానికి సంతానాన్ని బలిపెట్టుకొంటారా ?

శ_ (నిట్టూర్పు) హు !

గో_ ఇప్పుడైనా మించిపోయిందిలేదు. చేసిన తప్పును సరిదిద్దుకొని, మీ అబ్బాయి ఎక్కడవున్నదీ వెతికించి ఆదరించండి.

శ_ వాడు నన్నువిడిచివెళ్ళి దాదాపు ఇరవైవళ్ళు పైగా కావస్తూంది. ఇంతవరకూ ఎక్కడున్నదీ_ ఎలా వున్నదీ...

గో— మీకు తెలుపవలసిన అవసరం అతనికిమాత్రం ఏం వుంది? అతనుమాత్రం మీకుపుట్టిన బిడ్డ కాడా? మీ వంటి పట్టుదల అతనికిమాత్రం లేదా?

శ— ఏదో ఆవేశంలో ఇల్లువిడిచి పొమ్మన్నాననుకో, అంత మాత్రాన...

గో— ఇంతవరకూ కనిపించకుండా పోవాలా అంటారు?

శ— ("ఆఁ అదే" అన్నట్లుగా సంజ్ఞ చేస్తాడు)

గో— పోనీ ఇంతవరకూ మీరైనా అతడెక్కడున్నదీ, ఏమైనదీ ఆరాతీసారా?

శ— లేదు.

గో— అయినప్పుడు మీవిషయంమాత్రం మీ అబ్బాయి కెందుకు కావాలి?

శ— (కలుక్కుమంటాడు)

గో— పోనీ మీరే గుండెపై చేయివేసికొని చెప్పండి. మీ అబ్బాయిపై ద్వేషం మీలో పూర్తిగా సమసిపోయిందా?

శ— (మాట్లాడడు)

గో— లేదు, నాకు తెలుసు, ఆ ద్వేషం మీకీజన్మలో సమసి పోదు.

శ— గోవిందయ్యా, కుములుతున్న నాగుండెల్ని నీమాటల తో మళ్ళీ ఎందుకు కోతకోస్తావు?

గో— మిమ్మల్ని బాధించడం నా అభిమతంకాదు శరభయ్యా

గారూ, మీరూ ముసలివారై పోయారు. నేనూ దాదాపు ముసలివాడనై పోయాను. ఇక మనం ఎదురు చూడవలసింది చావునేకాని, జీవితాన్నికాదు. కనీసం ఈ చివరిఘడియల్లో నయినా మీ అబ్బాయి— ఈ నట్టింట్లో—కలకల్లాడుతూ—కిలకిల్లాడే బిడ్డలతో—కాపురం చేస్తూవుంటే— మీతోపాటు నేనూ కళ్ళారాచూసి— మీఆనందంలో పాలుపంచుకోవాలనివుంది.

శ— (నిట్టూర్పు) గోవిందయ్యా, ఎవరి నుదుట ఎంత రాసి పెట్టి వుందో అదేకాని అధికం కావాలంటే ఎక్కడ నుంచి వస్తుంది?

గో— అలాగని మనప్రయత్నాలు మనం మానివేయుంకదా?

శ— దైవం అనుకూలంగా లేనప్పుడు ఎన్నిప్రయత్నాలు చేసినా వ్యర్ధమేకదా గోవిందయ్యా.

గో— పోనీ, మీరు స్పష్టంగా పత్రికలో మరొక ప్రకటన ఈయగాదా?

శ— ఇప్పుడు ఇచ్చిన ఈప్రకటన చాలదా? (అంటూ ఒక దినపత్రిక గోవిందయ్యచేతికిస్తాడు)

గో— అప్పుడే ప్రకటన వెలువడడం, పత్రిక రావడంకూడా జరిగిందా?

శ— ఆఁ నిన్ననే వచ్చింది. కాని నీవే వూళ్ళోలేనందువల్ల ఇది చూడ్డం జరగలేదు.

గో— (దినపత్రిక తిరగవేసి చదువుతాడు) "నేను వార్ధక్య

దశలో వున్నాను. నావారసులు నన్ను వెంటనే కలుసు
కోండి. ఇట్లు: శాస్త్రిల శరభయ్య".
పోనీ సూటిగా అబ్బాయి పేరటనే ప్రకటన చేయలేక
పోయారా ?

శ— (నిట్టూర్పు) హు!

గో— అతని పేరుపెట్టి ప్రకటించడం మీకిష్టంలేదా ?

శ— కాదు.

గో— మరి ?

శ— ఇరవై ఏళ్ళక్రితం ఇల్లువదలి వెళ్ళినవానిగురించి ఏమని
ప్రకటించను ?

గో— అంటే ?

శ— (గద్గదికంగా) ఇంకా అతను జీవించే ఉన్నాడంటావా ?

గో— (చెవులు మూసికొని) రామరామ! మీకా కెందుకా
సంశయం కలిగింది ?

శ— జీవించివుంటే— ఇన్నిఏళ్ళలో ఒక్కనాడైనా నన్ను
వచ్చి కలుసుకోకుండా వుంటాడా ?

గో— పడుచువాడు, అతనివిషయంలోనే మీారలా భావిస్తూ
వుంటే— వయోవృద్ధులు మీావిషయంలో అతడెలా
భావించివుండాలి ?

శ— అవును. నేను జీవించివుండికూడా వాడికి చచ్చినవాళ్ళ
లోనే జమపడిపోయాను.

గో— గతించినదానికై చింతించడం...

శ- కూడదని తెలుసు.

గో- అయితే మీరెందుకలా దిగులుపడుతున్నారు ?

శ- ఇది దిగులుకాదు గోవిందయ్యా, ఏండ్లతరబడి నా గుండెల్లో పొగలుజిమ్ముతూన్న వేదన—ఆ వేదన.

గో- కలవరపడకండి. ఈ ప్రకటన చూసిన వెంటనే మీ అబ్బాయి...

శ- తిరిగి వస్తాడా ?

గో- తప్పకుండా.

శ- నీకు నమ్మకముందా ?

గో- ఉంది. మీకు లేదా ?

శ- లేదు.

గో- ఎందుచేత ?

శ- ఏమో. అతడు తిరిగివస్తాడనే నమ్మకం నాకులేదు.

గో- లేనిపోని అపోహలతో మీ మనస్సు ఎందుకు పాడుచేసుకొంటారు ?

శ- గోవిందయ్యా అతడు ఇంకాజీవించివుంటాడనే సంగతిని నేను నమ్మలేకపోతున్నాను.

గో- రామరామ. ఎందుకీ అమంగళవాక్యాలు ! చిరంజీవి తప్పక జీవించేవుంటాడు. తప్పక తిరిగివస్తాడు.
(ఇంతలో వీధితలుపు కొట్టిన చప్పుడవుతుంది)

గో- తలుపు చప్పుడవుతూంది. ఒకవేళ అబ్బాయి...

శ– వచ్చాడేమో. త్వరగా వెళ్ళి తలుపుతీయి గోవిందయ్యా
(గోవిందయ్య తలుపువైపుకు వెళుతూవుంటాడు)

శ– గోవిందయ్యా

గో– (వెనుదిరుగుతాడు)
ఆగుగోవిందయ్యా. వాడికి తలుపుతీసిన గౌరవం నాకే దక్కనీ... (అంటూ నెమ్మదిగా, తూలుతూ వెళ్ళి తలుపు తెరుస్తాడు. చిరంజీవి లోనికివస్తాడు. దాదాపు ఇరవై ఏళ్ళ యువకుడు సామాన్యమైన దుస్తులతో వుంటాడు. పై జామా, షర్టూ ధరించివుంటాడు. అతణ్ణి చూసి శరభయ్యా, గోవిందయ్యా క్షణంసేపు తెల్లబోతారు)

గో– ఎవరవునువ్వు ?

చి– చిరంజీవిని.

గో– అంటే ?

చి– అది నాపేరు.

గో– నీవిక్కడకు ఎందుకువచ్చినట్టు ?

చి– పెద్దలు. తమరేదైనా పనిచూపిస్తారని వచ్చాను.

శ– ఏంపనిచేస్తావు నువ్వు ?

చి– మీరుచెప్పినపని.

గో– నీదేవూరు ?

చి– చెన్నపట్నం.

శ– అంత పెద్దపట్నంలో నీకు పనే కరువయ్యిందా ?

చి— ఆపట్నంలో ఒక్క పనికేకాదు. అన్నిటికీ కరువే.

శ— మీ దేకులం ?

చి— మానవకులం.

శ— ఏఁవన్నావ్ ?

చి— మానవకులమన్నాను. మీరు మాకులానికి చెందరా?

గో— చెందకేం నాయనా ? అందరూ మానవ కులానికి చెందినవారమే. అయినా, ఈకాలంలో కులం ఎవరి క్కావాలి ? గుణం ప్రధానంకాని.

చి— అయితే గొడవేలేను. గుణంలో నాకేం లోటులేదు.

శ— మరెందులో లోటు ?

చి— ధనంలోనే.

గో— ఆసంగతి వేరే చెప్పాలా ? నీవు ధనవంతుడవైతే మావద్దకు నౌకరీకెందుకు వస్తావ్ ?

చి— చిత్తం, చిత్తం. నిజం గ్రహించారు.

శ— ఇంతవూ నీ కులమేఁవిటో చెప్పావుకాదు.

చి— చెప్పానుగా

శ— అదికాదోయ్, నీ జాతిసంగతి ?

చి— ఓహో ! అదాండి ! నాది మగజాతండి !

శ— ఎక్కడో తిక్కశంకరాయిలా వున్నావే! అదికాదు, నీవు శూద్రుడివా ? మాలవా ? మాదిగవా ? అని అడుగుతున్నాను.

చి— నిజం చెప్పమంటారా ? అబద్ధం చెప్పమంటారా ?

శ— అబద్ధం నాకెందుకు? నిజమే చెప్పా.

చి— నిజానికి నాకు కులం లేదండీ!

శ— ఓహో! కులంలేని బిడ్డవా?

గో— ఏకులమైతేనేం పోనిద్దురూ. ఈలంకంతలోనిట్లో మీరు ఒంటరిగానేకదా వుంటున్నారు. పోనీ, వీణ్ణి మీవద్ద వుంచుకోండి, సాయంగావుంటాడు.

శ— ఏమిటీ! వీణ్ణి నావద్దనుంచుకోనా?

గో— ఏం? మీ ఆచారపరాయణత్వం అంతరించిపోతుందా? మీ అమలిన బ్రాహ్మణ్యం అస్తమించిపోతుందా?

శ— అదికాదు గోవిందయ్యా

గో— ఏదికాదు? మరేం పరవాలేదు. మీవద్ద ఇతనిని నౌకరుగా వుంచుకోండి.

చి— మీకేంతైనా పుణ్యముంటుంది. మీవద్ద నౌకరీ ఇప్పించండి.

శ— అదికాదు గోవిందయ్యా, వీడు...

గో— ఎటువంటివాడోనని సంశయిస్తున్నారా?

చి— అలాంటి అనుమానం ఏమీ అక్కర్లేదండీ. అవసరమైతే మీకోసం నాప్రాణాలిస్తాను, మీకు నమ్మినబంటులా వుంటాను.

శ— పైకి అందరూ అలానే చెప్తారు, ఎలా నమ్మేది?

గో— నామాట వినండి శరభయ్యగారూ. నామట్టుకు వీడు నమ్మకస్తుడుగానే కనిపిస్తున్నాడు. పోనీ, కొంతకాలం

పరీక్షించి చూడండి.

చి— పని చెప్పి చూడండి, పరీక్షించండి. మీ మనస్సుకు నచ్చితేనే నన్ను పనిలోవుంచండి. లేదా పంపించి వేయండి.

శ— ఇంతకాలంలేని సౌకరు నాకిప్పుడెందుకు గోవిందయ్యా.

గో— ఎందుకైనా మంచిది. నామాట వినండి శరభయ్య గారూ, ఇతణ్ణి మీవద్ద నుంచుకోండి.

చి— కొండంత ఆశతో వచ్చాను. నన్ను కాదనకండి తాతయ్యగారూ. మీ కాళ్ళు పట్టుకొంటాను.

శ— ఊఁ సరేలే. ఇంతకూ జీతం ఏఁవిమ్మంటావ్ ?

చి— మీకు తోచిందియ్యండి, తాతయ్యగారూ.

గో— ఇంతకూ నీవుచేయవలసిన పనేఁవిటో తెలుసా?

చి— మీరు చెప్పందే నాకెలా తెలుస్తుందండీ?

శ— నీ కే యే పనులు చేతనవును ?

చి— ఏదో కొద్దిగా డొక్కశుద్ధి కలవాడనుకాబట్టి పద్దులూ, పత్రాలూ రాయగల్ను.

శ— నాకు ఏవ్యాపారం లేదు కాబట్టి— అది నా కనవసరం.

చి— ఎవరైనా పిల్లా జెల్లా వుంటే— వారికి చదువూ సంధ్యా చెప్పగలను.

శ— అదికూడా నాకనవసరం.

చి— (ఇంకా ఏంచెప్పనా అని తడుముకొంటాడు) మఱి... మఱి...బాగా దేహపరిశ్రమ చేశానుకాబట్టి ఎవరితో నైనా కుస్తీ పట్టగల్ను.

శ— చచ్చాను పో. నీతో కుస్తీపట్టే స్థితిలో నేను లేను. అది నాకనవసరం.

చి— మరి...మరి...ఈదగల్ను.

శ— అనవసరం.

చి— పాడగల్ను

శ— అనవసరం ·

చి— పోనీ మీకు కావలసిన పనేవిటో చెప్పండి.

శ— రోజూ బజారుకు వెళ్ళి కూరగాయలు తేవాలి.

చి— ఓ యస్ తెస్తానండి. వంకాయలు, బీరకాయలు, పొట్ల కాయలు, గుమ్మడికాయలు, అనపకాయలు, అన్నీ తేగల్నండీ.

శ— అంటే సరికాదు, వాటిలో నాకేమైనవి ఏరి బేరమాడి మరీ తేవాలి.

చి— చచ్చానుపో. ఏ విద్యాలయంలోనూకూడా బేరమాడ్డం నేర్పలేదే!

శ— ఎప్పుడూ చేదోడువాదోడుగా నీవు నా ప్రక్కనే వుండాలి.

చి— తప్పకుండా వుంటానండీ.

గో— శరభయ్యగారికి కాలునొచ్చినా, చేయినొచ్చినా నీవే కనిపెట్టి చూస్తూవుండాలి.

చి— మీరు వేరేచెప్పాలా ? కంటికి రెప్పలా చూసుకొంటా నండీ.

గో- వారు చాలా బలహీనులు. వారికి అన్నివిధాలా వేళకు సేవచేస్తూ వుండాలి.

చి- ఇన్నిమాట్లెందుకు? వారిని మా సొంత తాతయ్యలా చూసుకొంటాను. సరా?

గో- ఇదుగో చూడు నాయనా, తాతయ్యగారికి అప్పుడప్పుడు కాళ్ళూ చేతులూ లాగుతూవుంటాయి.

చి- లాగితే నేనూరుకొంటానా?

గో- ఊరుకోక?

చి- పట్టుకు పిసికేయనూ?

గో- ఏవిఁటీ?

చి- కాళ్ళూ చేతులూనండీ.

శ- ఇంకానయం, పీక పిసికివేస్తానన్నావుకాదు.

చి- రామరామ, మిమ్మల్ని అంతమాటంటానా తాతయ్యగారూ.

శ- ఎక్కడో అసాధ్యుడివిలా వున్నావే!

చి- నేను అసాధ్యుణ్ణి కాదండీ, ఛిరంజీవిని.

శ- ఓరి నీయిల్లు బంగారంగాను! మాట అంటే చాలు వసపిట్టలా అందుకొంటున్నావేఁమిటి?

గో- వీడో ఒంటరిగా వుండడంకంటె- ఇటువంటి వసపిట్ట దగ్గరవుంటే- మీకు కొంత పూసిపోతుంది. మరినాకు శెలవిస్తారా?

శ- అంత తొందరపడతావేం గోవిందయ్యా. కాస్సేపు

కూర్చో.

గో- శరభయ్యగారూ, నేను వచ్చి చాలా సేపయింది. పంగనామాల పాపయ్యగారు ఎందుకో నాకు కబురు చేసారట. నేను వెళ్ళి కనుక్కొని మళ్ళీవస్తాను. ఈ లోగా మీరితనితో కాలక్షేపం చేస్తూవుండండి, శెలవు.

(అంటూ వీధివైపు నిష్క్రమిస్తాడు)

చి- తాతయ్యగారూ, ఇంత పెద్దఇంట్లో మీరొక్కరేనాండి ఉంటున్నది ?

శ- అవును.

చి- మామ్మగారు లేరాండి ?

శ- లేరు.

చి- పొరుగూరు వెళ్ళారాండి ?

శ- కాదు. పరలోకం వెళ్ళారు.

చి- పోనీలెండి, ఈ నరలోకం కంటే అదేమంచిది.

శ- నోర్మూయ్.

చి- కోపం వచ్చిందాండి తాతయ్యగారూ ?

శ- (మౌనం)

చి- నాకు తెలియకడిగాను, మన్నించండి.

శ- లేదు నాయనా, నీపై నాకు కోపంలేదు.

చి- పోనీ, మీకెవరైనా బిడ్డలున్నారాండి ?

శ- లే. . .రు.

అయ్యో పాపం, దిక్కులేని పక్షులన్నమాట !
కాదు కాదు. నేను దిక్కులేని పక్షినికాదు.
అమ్మాయి వుంది కాబోలు.
అమ్మాయికాదు, అబ్బాయే వున్నాడు.
ఎక్కడ వున్నారండీ ?
తెలియదు.
ఏంచేస్తున్నారండీ ?
తెలియదు.
పోనీ జీవించి వున్నారాండీ ?
అదీ... తెలియదు...
చిత్రంగా వుందే! కొడుకు జీవించివున్నదీ లేనిదీ కూడా తెలియని...
దురదృష్టపు తండ్రిని నేనే నాయనా.
మిమ్మల్ని వదలి మీ అబ్బాయిగారు ఎప్పుడు వెళ్ళిపోయారండీ ?
దాదాపు ఇరవై ఏళ్ళకు పైగా కావస్తూంది,
ఎందుకు వెళ్ళిపోయారండి ?
(మౌనం)
మీతో పోట్లాడి వెళ్ళిపోయారాండీ ?
అవును.
పోట్లాట ఎందుకువచ్చిందండీ ?
ఎందుకో ఒకందుకు. నౌకరీకొచ్చినవాడివి నీకెందుకీ

విషయాలన్నీ ?

చి— మన్నించండి తాతయ్యగారూ, మీరింత మంచివారు కదా, మిమ్మల్ని వదలి అబ్బాయిగారు ఎలా వెళ్ళారా అని ఆలోచిస్తున్నా.

శ— నేను మంచివాడి నేనంటావురా ?

చి— కాదని ఎవరనగలరు తాతయ్యగారూ ?

శ— అయితే అబ్బాయి నన్ను మన్నిస్తాడంటావా ?

చి— మీరు దేవుళ్ళాంటివారు. మిమ్మెల్నెందుకు మన్నించరు తాతయ్యగారూ ?

శ— నీకు తెలియదురా. అబ్బాయి నన్ను మన్నించడు.

చి— అంత మన్నించరాని మహాపరాధం ఏం చేసేరు తాతయ్యగారూ.

శ— అవును. వాడిపట్ల మహాపచారమే చేశాను. తల్లిలేని బిడ్డకదా అని ఎంతో గారాబంగా పెంచాను. ఏకైక పుత్రుడు కదా అని "ఎక్కడలేని" మక్కువతో పెంచాను. అందరితోపాటుకలసిఆంగ్లేయవిద్యఅభ్యసిస్తానంటే— నాఆత్మకు విరుద్ధమైనా— కళాశాలకు పంపించి చదివించాను. అందుకు ఫలితం ఈవిధంగా వుంటుందనుకోలేదు.

చి— కళాశాలకు వెళ్ళి చదివింతర్వాత మీ అబ్బాయి ఏం చేశాడండీ ?

శ— మా కుటుంబగౌరవాన్ని కూకటివేళ్ళతో కూల్చి పార వేశాడు. మా వంశమర్యాదను మంటగలిపివేశాడు.

చి— అంత దారుణకార్యం

శ— ఒక క్రైస్తవకన్యను పెండ్లాడాడు.

చి— అది తప్పాండీ ?

శ— తప్పుకాదా? సదాచార సంపన్నమైన ఒక సద్బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి ఒక కులం కానిదాన్ని, ఒక మతం కానిదాన్ని వివాహంమాడతాడా? ఇది బ్రాహ్మణ్యానికి తలవంపులుకాదా ? నాకు శిరశ్ఛేదంకాదా ?

చి— ఎన్నడూకాదు తాతయ్యగారూ.

శ— ఏంవన్నావ్ ?

చి— అది మీకు శిరశ్ఛేదం కాదండీ.

శ— మరి ?

చి— అబ్బాయిగారి జీవితానందమేకదా మీలక్ష్యం ?

శ— అవును.

చి— అబ్బాయిగారి భావిసౌఖ్యమేకదా మీ స్వప్నం ?

శ— అవును.

చి— అయినప్పుడు ఆయన ఆనందాన్ని ఆయన ఏర్పరచుకొంటే మీరెందుకు బాధపడాలి ?

శ— ఆనందంకోసం అప్రతిష్ఠ పాలౌతామా ?

చి— అది మీఅపోహ తాతయ్యగారూ, అంతే.

శ— కాదు.

చి— ఒకతండ్రికి పదిమంది బిడ్డలున్నారు. ఆతండ్రి ఆస్తిపాస్తులకూ— గౌరవమర్యాదలకూ— వారు సమాన

భాగస్థులేనంటారా కాదా ?

శ– సమానులే.

చి– మనమందరమూ ఒకేఒక దేవుని ముద్దుబిడ్డలమనుకొంటే మన ఆభిజాత్యంలో ఎచ్చుతగ్గులేముంటాయి.

శ– అయితే మనలో మంచిచెడ్డల తారతమ్యం లేదంటావా ?

చి– లేదనను. అది ఆభిజాత్యాన్నిబట్టి ఏర్పడదు తాతయ్యగారూ.

శ– మఱి దేన్నిబట్టి ఏర్పడుతుంది ?

చి– ఆత్మసంస్కారాన్నిబట్టి.

శ– అంటే ?

చి– అందఱి గుణశీలాలు ఒక్కలా వుండవుకదా తాతయ్యగారూ.

శ– అవును.

చి– ఆ విభిన్నమైన గుణశీలాలవలననే మనలో తారతమ్యాలేర్పడుతున్నాయి.

శ– అయితే నీవుకూడా కులంకంటె...

చి– గుణం ప్రధానమంటాను. మీరు కాదంటారా ?

శ– ముమ్మాటికీ

చి– తరతరాలుగా మీలో జీర్ణించిన సనాతనత్వం మీచేత నలా పలికిస్తుందేకాని– మీరలా ఎన్నటికీ అనలేరు.

శ– కాదు.

చి– కాదని మీఆత్మను మీరు మోసగించుకొంటున్నారు.

శ– కాదు. అబ్బాయిచేసిన పనిని నేను హర్షించలేను. అందుకనే వాడిని నేను తూలనాడాను. జన్మలో నీ ముఖం నాకు మళ్ళీ చూపించవద్దన్నాను, అంతే. వెళ్ళిపోయాడు. మళ్ళీ ఇంతవరకూ తిరిగి కనిపించ లేదు.

చి– తాతయ్యగారూ నాకు తెలియకడుగుతాను, నిజానికి మీఅబ్బాయిపై మీకు కోపమేవుంటే– అతడు కని పించనందుకు మీరెందుకు బాధపడాలి ?

శ– నీకు తెలియదు నాయనా. ఒకవైపున కన్నకడుపుపై మమకారం– మరొకవైపున వాడుచేసిన పాపిష్ఠిపనిపై జుగుప్స– నాగుండె నెంత కోతకోస్తున్నాయో నీకెలా తెలుస్తుందిరా! రాగద్వేషాలమధ్య నామనస్సు నలిగి నలివైపోతూందిరా.

చి– ఆవేదనపడకండి తాతయ్యగారూ. పోనీ మీఅబ్బాయి గారు ఎక్కడున్నదీ వెతికిద్దాం.

శ– పోనీలేరా. ఎక్కడో ఒకచోట జీవించివుంటే అంతే చాలు.

చి– అంతమాటనకండి తాతయ్యగారూ, మీ అబ్బాయి తప్పక జీవించే...

శ– వున్నాడంటావు, ఆ ఆశ ఒక్కటే నాయనా, నా యీ అవసానదశలో అంధకారంలో దీపకళికలా మెరు స్తూంది.

చి– మీ దెంత మంచి హృదయం తాతయ్యగారూ! మీ మంచిని మీ కుమారుడు అర్థంచేసుకోలేకపోయాడు.

శ– ఇలారా నాయనా.

చి– (దగ్గరకు వస్తాడు)

శ– నీ పేరేఁవిటన్నావ్ ?

చి– చిరంజీవి.

శ– చిరంజీవీ, ఒకవేళ నేను చనిపోయినతర్వాత వాడి ఇంటికి వస్తే...

చి– అలాంటి మాటలనకండి తాతయ్యగారూ.

శ– వాడు వస్తే వాడితో "నీతండ్రి రాక్షసుడు కాడు బాబూ, కడవరకూ నీ మంచినే కోరుతూ కన్ను మూసాడు బాబూ" అని చెపుతావుకదూ ?

చి– తాతయ్యగారూ

శ– కనీసం నేను మరణించినతర్వాతనయినా వాడు నన్ను అర్థంచేసుకోగలిగితే అదే నాకుచాలు.

చి– మీరిలాంటి మాటలంటే నేనుండలేనిక్కడ తాతయ్య గారూ.

శ– అనను లే నాయనా. నన్ను వదలి ఎక్కడకూ వెళ్ళకు. ఏవిటో ఈవేళ నిన్నుచూస్తూవుంటే ముమ్మూర్తులా మా అబ్బాయి నాకు జ్ఞాపకంవస్తున్నాడు. ఇరవై ఏళ్ళ క్రింతం మావాడు కూడా నీలాగే వుండేవాడు. ఆ ఫోటో చూడు. ఇప్పుడెలా వున్నాడో ఏమో.

మీరలా బెంగటిల్లకండి తాతయ్యగారూ. అసలే వార్ధక్యం, పైగా ఇటువంటి బెంగలుకూడా తోడయితే...

ఆరోగ్యం దెబ్బతింటుంది అంతేనా ?

అవును.

హృదయమే దెబ్బతిన్నతర్వాత ఆరోగ్యంపోతేమాత్రం నాకేవిటి నాయనా ?

మీరు దిగులుపడకండి తాతయ్యగారూ. అబ్బాయిగార్ని రప్పించే ప్రయత్నాలు చేదాం.

ప్రయోజనంలేదు నాయనా. అదీ చేసాను.

ఏంచేసారు ?

ఇదిగో, ఈపత్రికలో ప్రకటన వేయించాను.

(అంటూ ఒక దినపత్రిక చిరంజీవి చేతికిస్తాడు)

(పేపరు త్రిప్పి ప్రకటన వెదికి చదువుతాడు) "నేను వార్ధక్యదశలో వున్నాను, నా వారసులు నన్ను వెంటనే కలుసుకోండి. ఇట్లు శాస్త్రిల శరభయ్య" ఇది చూసినట్లయితే మీ అబ్బాయిగారు తప్పక వస్తారు తాతయ్యగారూ.

అది నీభ్రమకాని ఇది వెలువడి అప్పుడే రెండురోజులయింది. వచ్చేవాడయితే ఈపాటికి రాడా ?

బహుసా ఈప్రకటన వారు చూసివుండరేమో.

పొరబాటు. ఆరోజునే మన ఆంధ్రదేశంలోని అన్ని

దినపత్రికలలోనూ ఆప్రకటన వేయించాను. ఒక పత్రికలో కాకపోతే మరొకపత్రికలో నయినా అతడా ప్రకటనచూసి వుండడా ?

చి— మొన్ననేకదా ప్రకటన వెలువడింది. బహుసా వస్తూ వుండవచ్చు.

(ఇంతలో తలుపు చప్పుడవుతుంది. శరభయ్య ఆదుర్దాగా తలుపువైపు చూస్తాడు)

శ— వెళ్ళు చిరంజీవీ, తలుపు తెరు.

(చిరంజీవి వెళ్ళి తలుపు తెరుస్తాడు. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకొంటూ అడ్డదారుల అనంతయ్య ప్రవేశిస్తాడు. అతణ్ణి చూడగానే "తన కొడుకు కాదు గదా" అనే నిరాశతో నిట్టూర్పు విడుస్తాడు)

అ— ఎలావుంది శరభయ్యబావా నీవంట్లో ?

శ— మామూలుగానే వుంది.

అ— బొత్తిగా నీరసించిపోయావు సుమా.

శ— ముసలివాడిని నాకు నీరసంకాక మరేవిటి ?

అ— అబ్బెబ్బే, అలా అనకంటి. నిక్షేపంలాంటి వజ్రకాయం మీది. మీకు ముసలితన మేవిటండీ ?

శ— అయితే నేను మనిషిని కాదంటావా అనంతయ్యా ?

అ— అబ్బెబ్బే. అలా ఎందుకంటాను. మీవంటివాళ్ళకు అరవై రోపడి అంటే మాంచి యవ్వనానికి మారుపేరన్నమాట.

ఆహా, అలాగా ?
ఈతరంవాళ్ళం మేమూ వున్నాం, ఎందుకు చెప్పండి.
ఇరవై ఏళ్ళకే ఈసురోమంటూ కాటికి కాళ్ళు చాస్తున్నాం.
వీరెవరు తాతయ్యగారూ ?
అడ్డదారుల అనంతయ్య అని...
శరభయ్యగారి ఆత్మబంధువుని. ఈ అబ్బాయి ఎవరు బావా ?
చిరజీవి అని...
శరభయ్యగారి నౌకర్ని.
అంతేకదా. మొహంచూసి ఏమో అనుకొన్నానులే.
ఏమనుకొన్నారేం ?
అబ్బెబ్బే. ఈకాలంలో నౌకరులకూ, యజమానులకూ తేడా తెలియడంలేదు బావా.
కొంపతీసి నేనే ఈఇంటి యజమాని ననుకొన్నారా ఏం ?
అబ్బెబ్బే. అంత తెలివితక్కువవాడి నేంకాదు నాయనా. ఏదో బంధువులేమో అనుకొన్నాను.
మీకొంభయం అక్కర్లేదులెండి, మీతో పోటీపడను.
పోటీపడితే వూరుకొంటాననుకోయ్. నా పేరేవిటో తెలుసా ?
అడ్డదారుల...

అ— అనంతయ్యాని.

చి— చిత్తం చిత్తం.

అ— మొన్న నేం జరిగిందా బావా, పట్నంలోకి కొత్తగా ఒక పెద్ద ప్లీడరుగారు వచ్చేరంటే, ఒక కేసు నిమిత్తమై వారింటికి వెళ్ళాను. వసారాలో ప్రవేశించగానే ఒక ఆసామిీ వ్రాతబల్లముందు కూర్చుని వ్రాసుకొంటూ వున్నాడు. కోటూ, పట్లాం, టై వగైరాలతో ఎంతో దర్జాగా వున్నాడు. అతనివద్దకు వెళ్ళి "ప్లీడరుగారూ" అంటూ కేసువిషయాలు ఏకరువుపెట్టసాగాను. మరొక ఆసామీ పంచె ఎగకట్టుకొని గోడలపై పటాలు బూజు దులుపుతూ వున్నాడు. అతణ్ణి పిలిచి "ఒ రే! అబ్బీ ప్లీడరుగారికీ, నాకూ రెండు "కాఫీలు" పట్రారా" అన్నాను. దానితో కుర్చీలో కూర్చున్నవాడు నిర్ఘాంత పోయి "అయ్యో ఆయనేనండి ప్లీడరుగారు. నేను వారి గుమస్తాను" అన్నాడు. నిలువునా చచ్చిపోయా ననుకో. వెయ్యి క్షమాపణలతో ఇవతలపడ్డాను. ఏతా వాతా చెప్పవచ్చిందేవిటంటే ఈకాలంలో నౌకర్లు వేషంలో యజమానుల్ని మించిపోయారు.

చి— పోనీలేవయ్యా, నా వేషానికి నీసొమ్మేం ధారపోయడం లేదుకదా.

అ— అబ్బెబ్బే. నా సొమ్మెందుకు ధారపోస్తాను. నేనంత పిచ్చివాణ్ణి కాదు.

అయితే నా వేషంపై నీకెందుకయ్యా అంత దుగ్ధ ?
చూసావా బావా, ఏవంటున్నాడో ?
భేషైన మాటన్నాడు.
నీవూ అలానే అంటావా బావా ?
మరేవనమంటావ్ అనంతయ్యా ?
నీముఖంచూసి ఊరుకొన్నానుగాని బావా లేకపో తేనా...
ఈపాటికి అడ్డదారులవారు దొడ్డిదారులు పట్టేవారు.!
విన్నావా బావా ?
విన్నాను.
అయితే నీ వేనన్నిలా అవమానపరుస్తున్నావన్నమాట.
నీకు అవమానమేఁవిటి అనంతయ్యా ?
అలా అన్నావు ఒప్పుకొన్నాను. మనమూ, మనమూ బావమరదులం కాబట్టి మనలో మనకు అవమానా లేఁవిటి ? అబ్బెబ్బే. నాకలాంటివేం లేవు. కాని మధ్య లో వీడెవడా నాపాలిటి...
యముడు అనుకొంటున్నారు.
చూసావా బావా వాడి పొగరు ?
పోనీలే అనంతయ్యా, వాడితో నీకేఁవిటి ?
అబ్బెబ్బే. వాడితో నాకేఁవిటి ? నాకున్నదంతా నీ తోనే.
ఇంతకూ నీవు వచ్చిన పనేఁవిటి అనంతయ్యా ?

అ— పనేంవుంది బావా ? నీవుచేసిన ప్రకటన పేపరులో చూసేటప్పటికి నాకు నిద్రపట్ట లేదనుకో. వెంటనే ఇలా పరుగెత్తుకు వచ్చాను.

చి— ఆప్రకటన చూసేవరకూ మీకు శరభయ్యగారి సంగతే పట్ట లేదన్నమాట.

అ— నాసంగతి నీకు తెలియదా బావా ? ఎప్పటికప్పుడు నిన్ను వచ్చి చూదామని అనుకోంటూ వుండడం— ఏదో అవసర కార్యాలు మీదపడి ప్రయాణం వాయిదా పడుతూండడం జరిగేది.

చి— కాని ప్రకటనచూడగానేమాత్రం ప్రయాణం వాయిదా పడ లేదు.

అ— మధ్య నీవేమిటోయ్ పానకంలో పుడకలాగ. ఇదిగో బావా . ఈప్రకటన చూసినప్పటినుంచీ మీ చెల్లాయి ఒకటే పోరనుకో. "అయ్యో అన్నయ్య ఎలావున్నాడో వెళ్ళి చూసిరండి, చెట్టంత కొడుకు చెదిరి పోనే పోయేడు. అన్నయ్యకు మనంతప్ప ఎవరమున్నామండి వారసులం ? అయినా ముసలివాడై పోయాడు. పోనీ అందరం పోయి అక్కడే వుందాం. ఈస్థితిలో ఆయన్ను ఓనం ఆదుకోకపోతే ఎవరాదుకొంటారు చెప్పండి" అంటూ చెవినిల్లుకట్టుకొని పోరిందనుకో. నిజానికి బేవా, మీచెల్లి నీవంటే ఛడిచస్తుందనుకో.

చి— ఆఁవిడే అన్నమాటేఁవిటి ? మీరూ పడిచస్తున్నా
రుగా ?

శ— (కోపంగా) చిరంజీవీ

అ— (చిరంజీవివైపు కోపంగా చూస్తాడు) శరభయ్యబావా
ఈమాత్రందానికి పత్రికలో ప్రకటించాలా ? కాకిచే
కబురంపితే వచ్చివాలమా ?

శ— అంత అవసరమనిపించలేదు అనంతయ్యా.

అ— అయినవాళ్ళ మయింతర్వాత నిస్సిస్థితిలో వదలి ఊరు
కొంటే— నీవ్వూరుకొన్నా— లోకం వూరుకొంటుందా
బావా ?

చి— ఊరుకోక ఏంచేస్తుందండీ ?

అ— అమ్మబాబోయ్ పొడుచుకుతినివేయదూ ?

శ— అందుకు ఏంచేస్తానంటావు అనంతయ్యా ?

చి— ఎంచేస్తారు ? మీవద్దనే వుండి మీఆస్తికి మంగళహారతి
పాడతారు.

అ— ఇదిగో అబ్బాయి నీపేరేఁవిటి ?

చి— చిరంజీవి,

అ— ఇదిగో చిరంజీవీ, నీవు మాబావమరుదుల విషయాల్లో
తలదూర్చావా ముందు నీకు పాడబడుతుంది మంగళ
హారతి.

చి— పోవయ్యా నీమాటెవడికి ?

అ— చూసావా బావా చూసారా ?

శ— ఏం చూడమంటావు అనంతయ్యా ?

అ— వాడి తలబిరుసు.

చి— మీమాట దురుసు ?

శ— రెండూ చూసాను. ఇంతకీ ఏవంటావ్ అనంతయ్యా ?

అ— మేం వుండగా నీకు బాధేవిటి బావా ? నిన్ను కంటికి రెప్పలా చూసుకొంటాం.

శ— అంత అవసరమైనపుడు కబురంపిస్తానులే అనంతయ్యా.

అ— అదేవిటి బావా అలాఅంటావ్ ? నిన్ని ముసలితనం లో వదలి ఎలావుండమంటావ్ ?

చి— ఇన్నాళ్ళూ ఎలావున్నారు ?

అ— ఇన్నాళ్ళ లెక్క వేరు, ఇప్పుడు వేరు.

చి— అవునవును. ఇప్పుడు మీరు ఊరుకొంటే మరో వార సుడు ఎవడేనా ఆస్తి ఎగరేసుకుపోవచ్చు.

అ— ఛచ్ఛా. ఆస్తిపై ఆశ నాకెప్పుడూ లేదు. ఏం బావా నాసంగది నీకు తెలీదూ ?

శ— తెలియకేం బాగా తెలుసు. నీవేకదూ మాఅబ్బాయికీ నాకూ అంతఃకలహాన్ని రగిలించి ఇంటినుండి వాణ్ణి తరిమివేసేలా చేసావు ?

అ— రామ రామ ! ఎంత అభాండం నా నెత్తిపై వేసావు బావా ?

శ— నిజంచెప్పు అనంతయ్యా, మా అబ్బాయి చంద్రానికీ, నాకూ ఏర్పడిన అభిప్రాయభేదాన్ని ఆధారంగా చేసి

కొని మా ఇరువురిమధ్యా విద్వేషాన్ని రెచ్చగొట్టి, మేము విడిపోవడానికి కారణం నీవుకాదా ?

అ– అగ్నిహోత్రంవంటి కొంపలో అప్రాచ్యపు పని జరుగుతూ వుంటే– చూస్తూ ఊరుకోలేకపోయినందుకు– నా నెత్తిపై ఇంతటి నింద వేస్తావా బావా ? అయినవాడిని...

శ– అయినవాడివి ! నీవు నాకేవిధంగా అయినవాడివి ? నీవు నా కెటువైపు చుట్టానివి ? నీకూ నాకూ ఏవిటి సంబంధం ?

అ– కాదనుకొన్నా, లేదనుకొన్నా ఉన్న బంధుత్వాలు పోతాయా బావా ?

శ– నీకూ నాకూ ఉన్న బంధుత్వం ఏఁవిటనే నేనూ అడుగుతున్నాను.

అ– రాకపోకలు లేక ఇపుడంటే మనమిలా దూరదూరంగా వుండి పోయాం గాని మీ ముత్తాతా, మా ముత్తాతా స్వయానా బావమరుదులు కాదా ?

చి– బాదరాయణ సంబంధం బలమైనదే !

శ– మీ తాతా, మా తాతా ఆమరణ విరోధులు. ఆ యింటిపై కాకి ఈఇంటిపై వాలేదికాదు. తెలుసా ?

అ– విరోధాలు బంధుత్వాన్ని తెచ్చిపెడతాయా అనంతయ్యా, నీ పిచ్చికాని.

చి– వరసలులేని బంధుత్వాన్ని తెచ్చిపెడతాయా అనంతయ్యా, నీపిచ్చికాని.

అ– లేని బంధుత్వాన్ని నేనేం తెచ్చిపెట్టుకోవడంలేదు.

అడ్డదారులవారికీ, శాస్త్రులవారికీ అనాదినుంచీ బంధుత్వమే.

శ– అంత బంధుప్రీతి కలవాడవయితే– నీ స్వయానా బావమరది బంగారయ్య పక్షవాతంలో తీసికొంటూ వున్నాడు. అతణ్ణి ఆదరించకూడదా ?

చి– బహుసా అతనివద్ద "తైలం" లేకపోవచ్చు.

అ– చిన్నవాడివైనా నిజం చెప్పావు చిరంజీవీ. అతణ్ణి ఆదరించడమంటే ఆతడి దరిద్రాన్ని మనం కోరి తెచ్చుకోవడమన్నమాట !

చి– శరభయ్యగార్ని ఆదరించడమంటే– వారి సంపదను కోరి తెచ్చుకోవడమన్నమాట.

శ– అనంతయ్యా, నీ ఆదరణకూ, అభిమానానికీ పదివేల నమస్కారాలు. ఇక వెళ్ళు.

అ– బావా

చి– వీధిగుమ్మం అటువుంది అనంతయ్యగారూ.

అ– నాకు తెలుసులేవోయ్–బావా, చంద్రం విషయంలో నీవు నాపై ఏదో అపోహపడుతున్నావుకాని– నిజానికి అతడుచేసిన పని నీకుమాత్రం బావుందా బావా ?

చి– ఆయనకు బావున్నదీ లేనిదీ మధ్య మీకెందుకు ?

అ– మధ్య నాకుకాకపోతే మరెవరికోయ్ ? చంద్రం ఆ అప్రాచ్యపు పని చేయకపోతే– లక్షణంగా మా అమ్మాయి ఈ ఇంటి కోడలై యుండేదికదా ?

వియ్యాలవార్రై మీరు విందు లారగించేవారుకదా!
అయిపోయినదానికి ఎన్ని అనుకొంటే ఏంవుంది బావా.
చంద్రం ఎలాగూ లేదుకాబట్టి— ఒకవేళ వున్నా అటు
వంటి అప్రాచ్యుడికి నీ ఆస్తినిచ్చి ఎలాగూ అపకీర్తి
తెచ్చుకోవు కాబట్టి— మేముతప్ప నీ కెవరున్నారు
బావా వారసులు?
ఎవరూ లేకపోతే నాఆస్తిని ఏ అనాధశరణాలయానికో
రాసిపారవేస్తాను.
అంతేకాని మీకుమాత్రం ఇవ్వరు.
అలా అంటే కుదురుతుందా బావా? కోర్టు వూరుకో
వద్దూ?
కోర్టు ఏచేస్తుందోయ్ కోర్టుపక్షీ?
ఏంచేస్తుందా? శరభయ్యగారి యావదాస్తికీ నేనే
వారసుణ్ణని తేలుస్తోందోయ్ శకునపక్షీ?
తేల్చినప్పుడు తిరిగి రావచ్చు. ప్రస్తుతానికి పోవయ్యా
దేవయ్యా.
నేను పోవడానికి రాలేదేయ్ పుల్లయ్యా.
మరెందుకు వచ్చినట్టు?
నేను నీ ఏకైక వారసుణ్ణి బావా. నేనెలా పోతాను?
పోక ఏం చేస్తావేం?
ఇక్కడే వుంటాను.
ఎలాగపోవో చూస్తాను. నా ఆస్తిలో పూచికపుల్ల

కూడా నీకు ఇవ్వను.

(ఇంతలో వీధివైపునుండి తికమకల తిరపతిశాస్త్రి విసురుగా ప్రవేశిస్తాడు. ఆధునికతా, సనాతనత్వమూ కూడా అతనిలో విచిత్రంగా సమ్మిళితమై వుంటాయి. క్రాపింగూ, పిలకా, పంచికట్టూ. లాల్చీ, కండువాలతో వింతగా వుంటాడు. ఉచ్చారణకూడా ఏదో తెచ్చి పెట్టుకొన్నట్లుగా, నాగరికుల్ని అనుకరించినట్లుగా వుంటుంది)

తి– నిక్షేపంలా నేనుండగా అత నెవడండీ మీఆస్తి అందుకోడానికి ?

చి– ఇంతకూ మీరెవరు ?

తి– నేనా ? తికమకల తిరపతిశాస్త్రిని. శరభయ్యగారి మామగారి తోడల్లుడికి వేలువిడిచిన తమ్ముణ్ణి.

చి– అబ్బో. బంధుత్వం చాలా పెద్దదే!

తి– సూక్ష్మంగా చెప్పాలంటే శరభయ్యగారికి నేను వరసకు మావగార్ని అవుతాననుకో.

అ– వరసకే అన్నమాటేంవిటి? నిజంగా అవబోయిన మావగారే. మా శరభయ్య బావ ఒప్పుకోలేదుగాని ?

శ– అయితే నీవెందుకు వచ్చావు తిరపతీ ?

తి– ఏంవుంది. పేపర్లో మీప్రకటన చూడగానే.

చి– పరుగెత్తుకు చక్కా వచ్చారు,

తి– పరుగెత్తుకు రాలేదోయ్, బస్సుమీదే వచ్చాను.

శ— వచ్చిన పనేవిటి ?

తి— పనేంవుంది శరభయ్యగారూ, కావలసినవాణ్ణి కదాఅని మీారెంత కష్టపడుతున్నారో పాపం అని...

చి— మిమ్మల్ని కాపాడ్డానికి ఇక్కడ అవతరించారు.

అ— ఆమాటకొస్తే శరభయ్యబావా తిరపతిశాస్త్రి నాకంటె నీకు కావలసినవాడా ?

తి— నిజం చెప్పండి శరభయ్యగారూ, మీా తాతలనాటి నుంచీ అడ్డదారులవారికీ, మీాకూ సంబంధాలు లేవే. ఈనాడు ఉన్నాయీాఅంటే చెల్లుతాయా ?

అ— "శాస్త్రిలవారికి, అడ్డదారులవారితో సంబంధంలేదట! తికమకలవారితోనే సంబంధం వుందట ! హావ్వ, ఎవరైనా వింటే నవ్విపోతారు.

తి— మధ్య నీవెవడివోయ్ ? మాతో సంబంధం లేదని శరభయ్యగార్ని అనమను చూస్తాను.

అ— అను బావా వారితో నీకేవిటి సంబంధం ?

శ— తిరపతీ, ఇలారా. నీతో నాకెంతమాత్రం సంబంధం లేదు.

అ— అయిందా శాస్త్రి ?

తి— అయితే మీాకు అడ్డదారులవారితో సంబంధం వుందంటూరా ?

శ— అనంతయ్యా ఇలారా. నీతో నాకంతకంటె సంబంధం లేదు.

చి— ఇకనేం ? మీా ఇరువురూ కలసి వెళ్ళిపోవచ్చు. వీధి తలుపు తెరచేవుంది.

తి— నీవెవడవోయ్ మధ్యని ?

అ— ఇతనా, శరభయ్యగారి తోక.

చి— కాదు, నౌకరు.

శ— తిరుపతీ, అనంతయ్యా నన్నాట్టే విసిగించకండి. వచ్చిన దారినే వెళ్ళిపొండి.

తి— అదేవిటి శరభయ్యగారూ ? అట్లా మాట్లాడతారు ? రమ్మనడానికి, పొమ్మనడానికి మీాఇష్టమేనా ?

శ— నిన్ను అసలు ఎవరు రమ్మన్నారు ?

తి— అయితే మీారు పత్రికలో ప్రకటన చేయలేదా ?

శ— చేసాను.

తి— అది నాకోసం కాదా ?

శ— కాదు.

అ— నీకోసం కాదోయ్, అది నాకోసం !

శ— మీా ఇరువురికోసంకూడా కాదు.

అ— జాతిభ్రష్టుడైన కొడుకోసమా ?

తి— కిరస్తానీదాన్ని కట్టుకొని బ్రాహ్మణ్యాన్ని మంటగలిపిన ప్రబుద్ధుడు చంద్రం కోసమా ?

శ— ఎవరో ఒకరికోసం, మీాకోసం కాదు. మీారు పొండి.

తి— తిరిగి ఆ కులభ్రష్టుణ్ణి పిలిచి— మీా వంశాని కింతవరకూ లేని మచ్చను తెచ్చుకొంటారంటే— ఎవరో మిమ్మల్ని

తెలియనివాళ్ళు నమ్మవలసిందేకాని నేను నమ్మను.

అ— అసలు చంద్రం ఉన్నదీ లేనిదీ ఎవడికి తెలుసు ?

శ— అనంతయ్యా ?

అ— ఎంతయినా కన్నతండ్రి కదా మీరు! ఇన్నేళ్ళయింది ఒక్కసారైనా వచ్చి మిమ్మల్ని చూసాడా ?

తి— అవును, అదీ ఒకమాటే. అతనికిమాత్రం తండ్రిపై మమకారం వుండదా ? జీవించి వుంటే తప్పక వచ్చి వుండేవాడే.

శ— తిరుపతీ—

చి— వారు శంభయ్యగార్ని వచ్చి చూడకపోయినంత మాత్రాన చనిపోయినట్టేనా ?

తి— కాక ? ఇన్నేళ్ళా గడిచినా కన్నతండ్రిపై ద్వేషం ఆయనకు చావనట్టా ?

చి— ఏదైతే మీకెందుకు ? మీదారిని మీరు పొండి.

తి— నేనూరికే పోవడానికి రాలేదు.

శ— మరెందుకు వచ్చారు ?

తి— మీరు కాదన్నా, అవునన్నా మీఆస్తికి వారసుణ్ణి నేను.

అ— కాదు, నేను.

తి— (అతనివైపు కోపంగా చూస్తాడు) కాదు, నేను.

అ— (మరీకోపంగా చూస్తాడు) కాదు, నేను.

తి— పోనీ మేమిద్దరం.

అ— అవును. మేమిద్దరం మీఆస్తికి వారసులం.

శ— మీరు నాకు వారసులుకాదు.

తి— మరి ?

శ— నాప్రాణం తీయడానికి వారశూలలా తయారయ్యారు.

అ— నీవేమన్నాసరే. నీఆస్తి మాకు చెందితీరుతుంది.

తి—. కాబట్టి నిన్ను కనిపెట్టుకొని ఉండడం మావిధి.

శ— నన్ను కనిపెట్టుకొని వుండడంవల్ల నా ఆస్తి మీకు దక్కుతుందనుకొంటున్నారా ?

తి— పోనీ ఏంచేయమంటారో చెప్పండి.

శ— మీా రేమీా చేయనక్కరలేదు. నన్నువిడిచి పొండి.

అ— అదిమాత్రం నేనుచేయను.

తి— నేనంతకంటే చేయను.

శ— మీారేంచేసినా సరే, నాఆస్తిలో చిల్లిగవ్వకూడా మీాకివ్వను.

తి— మీారిచ్చేదేఁవిటి శరభయ్యగారూ, ఇది మీా స్వార్జితం కనకనా ?

అ— మరే! మీాతదనంతరం కోర్టువారే మాకు దఖలు పరుస్తారు.

తి— శరభయ్యగారూ, నేడు మీాఅవస్థ చూస్తుంటే నాకు జాలివేస్తూంది.

చి— పాపం, ఎంతజాలిగుండె మీాది !

తి— అవును. ఆనాడు నేను చెప్పినట్లే చేసివున్నట్టయితే

మీాకీ దురవస్థ వుండేదికాదుకదా !

శ— అంటే నీకూతుర్ని పెండ్లాడివుంటేసనా నీభావం ?

తి— అవును. ఈ అవసానకాలంలో మీాకెంత ఆసరాగా వుండివుండును ! దేవుడు మేలుచేసినట్లయితే మీాకు మరోసారి సంతానవంతులై వుండేవారు !

చి— పోనీ, ఇప్పుడైతేం మరో అమ్మాయి ఉందేమో చూడండి, ముడిపెట్టివేయవచ్చు.

తి— శరభయ్యగారు ఊ అనాలేకాని ఇప్పుడుమాత్రం వారికి పిల్లనీయననేవారు ఎవరు ?

శ— ఈ అవసానకాలంలో నాకు పెళ్ళి ఒక్కటే తరువాయి!

తి— అలా అనకండి శరభయ్యగారూ. పూర్వం షష్టిపూర్తి అంటే సంపూర్ణ యౌవనానికి తార్కాణంగా పరిగణించేవారు.

అ— పూర్వమే అన్నమాటేమిటి? శరభయ్యగారిలాంటివారి విషయంలో అది సర్వకాలీనా సత్యం.

తి— కాదామరి ? మీారు కో అంటే కోటిమంది సంబంధాలు తెచ్చి మీాముందుంచుతాను. ఆంధ్రకన్యల త్యాగానికి అవధిదండీ. ఎవరైనా మిమ్మల్ని పెండ్లాడవచ్చు.

శ— తిరపతీ, నాకు ఏపెళ్ళీ చేయనూవద్దు, ఏపిల్లగొంతూ కోయనూవద్దు.

తి— అదేమిటి శరభయ్యగారూ అలా అంటారు ? వెయ్యి అబద్ధాలాడి అయినా ఒకపెళ్ళి జరిపించమన్నారు.

శ— అబద్ధాలూవద్దు, పెళ్ళీవద్దు. నీవు అవతలకుపోతే అంతే చాలు.

తి— ఏదో కావలసినవాడవు కదా అని ఉపకారం చెయ్య బోతే...

శ— ఉపకారం ! హు ! నీవు నిజంగా నాకుపకారం చేయా లనే వచ్చావా ?

తి— అవును.

శ— అయితే వెంటనే బైటకుపో. ఇదేనీవునాకుచేసేఉపకారం.

తి— అదిమాత్రం కుదరదు.

శ— ఎలాకుదురుతుంది ? నీవు నాకుపకారం చేయాలని రాలేదు. నాఆస్తికోసం వచ్చావు.

తి— హక్కుగల ఆస్తికోసం రావడం తప్పా ?

శ— హక్కు ! ఏఁవిటి నీహక్కు ? చంద్రం నాకు దూర మయ్యాడని దిగులుపడుతున్న సమయంలో— అతనిపై ద్వేషం నాలో పెంపొందిస్తూ— నీకూతుర్ని నాకు అంటగట్టి— నాఆస్తి కాజేయాలని చూసింది నీవు కదూ ? అది ఫలించలేదని ఇప్పుడు వారసుడనంటూ తయారయ్యావా ?

తి— శరభయ్యగారూ, మీరు ఆగ్రహం ప్రదర్శిస్తే నేను హడలిపోతా ననుకొన్నారా ? లాభంలేదు. మీరు "ఛీ" అన్నా, "ఛా" అన్నా— మాకు చెందవలసిన దాన్ని ఎన్నడూ వదలుకోము. ఏఁవంటావు అనం తయ్యా ?

ముమ్మాటికీ వదలుకోం.
వదలుకోక మీ రేంచేస్తారేం ?
చూరుపట్టుక వేళ్ళాడతారు. అంతకంటే ఏంచేస్తారు ?
మెడపట్టి గెంటిస్తాను. ఎవరడ్డువస్తారో చూస్తాను.
ఆపప్పులేం వుడకవు శరభయ్యగారూ. మేం మీకు వారసులం, మమ్మల్ని కాదనేవాడు...
(దురుసుగా బురదగుంటల వీరవరాహాలు ప్రవేశిస్తాడు. అతని కట్టూ, జుట్టూ అత్యంతాధునికంగా వుంటాయి. ఫాంటూ, బ్లౌజు ధరించి వుంటాడు. ఈవెనింగ్ కేప్ పెట్టుకొనివుంటాడు. ఏఁవీ తనకు తెలియకపోయినా తెలిసినట్లు మసలుతూ వుంటాడు. ఇంగ్లీషు వాడుతూ వుంటాడు. డాబుసరీ, డంబం ఆతని నిలువెల్లా కనిపిస్తూ వుంటుంది.
లేకేం ? నేనున్నానుగా.
(అందరూ ఒకసారి అతనివైపుచూసి నిర్ఘాంతపోతారు)
ఓ మైడియర్ గ్రాండ్ ఫాదర్! నీవింకా నన్ను రికగ్నైజు చేయలేదా ?
(దగ్గరకు పిలుస్తూ) చిరంజీవీ, ఫాదిరీ అంటాడేఁవిటి ! ఇక్కడెవరూ పాదిరీలు లేరనిచెప్పు.
ఓ! మైగాడ్ ! మనకంట్రీలో ఇంగ్లీషు రాకపోవడమంత దౌర్భాగ్యం మరోటిలేదు.
ఇంతకూ నీవెవరవు నాయనా ?

హో— అప్పుడే మర్చిపోయారా తాతయ్యగారూ? నేను "మిష్టర్ హోల్" ను.

అ— "మిష్టరు హోలేం"విటి తిరుపతీ. సినీమాహోలులాగ?

తి— నీకు తెలియదులే అనంతయ్యా, అది పేరు.

అ— అదేం! అదేం పేరు!

శ— కొంపతీసి నీవుకూడా నా వారసుడివి కావుకదా?.

హో— కరక్టు తాతయ్యగారూ, మీ ఊహ సెంట్ పర్సెంట్ కరక్టు.

శ— నీవెవరి అబ్బాయివి నాయనా?

హో— బురదగుంటలవారి అబ్బాయినండీ.

శ— ఓహో! బురదగుంటల వీరవరాహాలువా?

హో— అంతపొడవుగా వుంటే పలకడం కష్టమని— కురచగా "హోల్" అని మార్చి వేసుకొన్నాను తాతయ్యగారూ.

శ— అయితే నీవూ నాకు వారసుడనే అంటావు.

హో— కాదని "ప్రూవ్" చేయమనండి ఒక్కణ్ణి చూస్తాను.

తి— నీవు శరభయ్యగారికి ఎలా వారసుడివి నాయనా?

హో— అలా అడిగారు బావుంది. దీన్ని రుజువుచేయడానికి సవాలక్ష ఆధారాలున్నాయి.

అ— అన్నీ అక్కర్లేదుకాని ఒక్కటిచెప్పు చాలు.

హో— నేను పుట్టకముందే శరభయ్యగారు మా అమ్మగార్కి Promise (వాగ్దానం) చేసారు.

ఛి— ఏఁవని?

హా— మా అమ్మ కడుపున ఒక మగనలుసు పుడితే తన రెండవ కొడుకుగా పెంచుకొంటానని.

శి— ఇంతకూ సీతా అమ్మగారు శరభయ్యగారికి...

అ— ఏకంగా చుట్టంఅంటున్నాను ?

హా— శరభయ్యగారి మేనమామ తోడల్లుడిగారి (కూతురు) Own Daughter

చి— శరభయ్యగారు తమర్ని తమ రెండో కొడుకుగా చూసుకొంటామని వాగ్దానం చేసారా ?

హా— అవును.

శి— ఇందుకు సాక్ష్యం ?

హా— వేరేఎందుకు ? నామాటే సాక్ష్యం.

అ— మాటంటే చెల్లదోయ్ హాలూ.

తి— ఏదో చూపించు ఆనవాలుగా

చి— కట్టిపెట్టండి కలహాలు

శ— నోరుముయ్యండి చాలు

హా— చంద్రం లేదుకాబట్టి శరభయ్యగారికి నేనే ఏకైక వారసుణ్ణి.

అ— కాదు, నేను.

తి— కాదు, నేను.

చి— పోటీపడ్డమెందుకు ? పోనీ ముగ్గురూ వాటావేసుకోండి.

అ— నీకడుపు చల్లగా ఇంకా అలాఅన్నావ్ బావుంది.

హా— కేవలం నాకే చెందవలసిన వారసత్వపు ఆస్తికి వాటా

లకు ఒప్పుకోవడం నాకెంతమాత్రం ఇష్టంలేదు.

Don't like it.

అ— నిజం చెప్పకపోవడమేం ? నాకూ ఇష్టంలేదు.

తి— పైగా అది నాకు అవమానకరం కూడా.

హా— కాబట్టి మీరు వెంటనే శరభయ్యగార్ని విడిచి వెళ్ళి పోవడం మంచిది.

అ— అదిమాత్రం జరుగదు.

తి— (హాలుతో) ఆపని నీవుచేస్తే మేం సంతోషిస్తాం.

హా— పాపం, ఆ అవస్థ మీకు పట్టదులెండి. మీరు మాతాత గారు శరభయ్యగారి ఆస్తిని "మిజప్రాప్రియేట్" చేస్తు న్నారని ఒక్క కంప్లైంట్ పారవేసాసంటే చాలు. మీ రేమౌతారో ఆలోచించుకోండి.

చి— వారిమాటకేంగాని మీకుమాత్రం ఆకంప్లైంట్ వర్తించదా ?

హా— నాకెలా వర్తిస్తుంది ! నేను వారికి స్వయానా వార సుణ్ణి.

అ— నేనుమాత్రం కానా ?

తి— మీ ఇద్దరికంటె ఎక్కువ వారసుణ్ణి నేను.

హా— మీరాయన వారసులు కారు.

అ-తి— (ఒక్కసారిగా) నీవే కాదు.

హా— పోనీ మనలో మనకు గొడవెందుకు ? పోరు నష్టం, పొందు లాభం అన్నారు.

అ— కాబట్టి మనం ముగ్గురమూ ఆయనకు వారసులమే.

తి— సరే, నేనుమాత్రం ఎందుక్కాదనాలి? శరభయ్యగారికి మనం ముగ్గురమే వారసులం.

చి— తాతయ్యగారూ, మీ ముగ్గురు వారసులకూ ఒప్పందం కుదిరింది. ఇక మీఆస్తి పంచిపెట్టడమే తరువాయి.

శ— నేను వీళ్ళకు నయాపైసాకూడా పంచిపెట్టను.

హా— మీరు పంచిపెట్టేదేమిటండీ? మీ తదనంతరాన అదే మాకు దఖలుపడుతుంది.

శ— హారి మీఅసాధ్యం కూల! నేను చస్తే నా ఆస్తి పంచుకుపోదామని చూస్తున్నారా మీరంతా?

చి— లేక మీకు వార్ధక్యంలో నిజంగా తోడుపడేందుకు వచ్చారా వీరు?

శ— అయితే వారసులూ, మీరందరూ ఇలారండి
(అనంతయ్య, తిరుపతి, హాలు అతనివద్దకు చేరతారు)

శ— ఈఆస్తి నాస్వార్జితం కాదు. కాబట్టి ఇది మీరు నా మరణానంతరమే కదా పంచుకోవాల్సివుంది.

హా— మీఅంతట మీరు పంచనిపక్షంలో

శ— నాఅంతట నేనిది పంచను.

తి— అయితే పోనీ మీ తదనంతరమే పంచుకొంటాం.

శ— అయితే వారసులూ, బాగా వినండి. నేను కొద్ది రోజుల్లో చనిపోవాలనుకొని తొందరపడి ఆ ప్రకటన చేసాను.

అ— ఏం ఇప్పుడేంవచ్చింది మళ్ళీ ?

శ— మిమ్మల్ని చూసింతర్వాత ఆ అభిప్రాయం మార్చు కొన్నాను. నేనింతట్లో చావదల్చుకో లేదు.

తి— అదేం కుదరదు. చావడానికీ మానడానికీ మీ ఇష్టమేం ?

చి— కాక మీ ఇష్టమా ?

అ— అబ్బెబ్బే. అదికాదు. చావు మన ఇష్టప్రకారం వస్తుందా ?

తి— ఆయుష్కాలం ముగియగానే— చావు ఆగమంటే ఆగు తుందా ?

హా— మానవుడు అన్నింటినీ కంట్రోల్ చేయగలిగాడు గాని చావును తన అదుపులో పెట్టుకోలేకపోయాడు.

శ— నేను చావను. చావను. చావను. అంతే,

అ— అబ్బెబ్బే, అలా అంటే ఎలా? మీరుచనిపోక తప్పదు.

తి— అందులోనూ వయోవృద్ధులు, మీరు చావకపోతే ఎవరు చస్తారు చెప్పండి.

హా— "ఆల్ మెన్ ఆర్ మోర్టల్" శరభయ్య తాతగారూ మీరు చావునుండి తప్పించుకోలేరు.

శ— నేను చావను మొర్రో అంటుంటే మీరెవర్రా నన్ను చావమనడానికి ?

చి— మీ వారసులు తాతయ్యగారూ, మీ వారసులు.

శ— మీరెన్ని చెప్పినా సరే, నేనింతట్లో చావను. నాఆస్తి మీకు దక్కదు.

తి— చావకపోవడానికి మీరేమైనా దేవుళ్ళా ?

అ— మీరేమైనా అమృతం త్రాగారా ?

హా— లేక మీరేమైనా భీష్మాచార్యునిలా స్వచ్ఛంద మరణాన్ని సాధించారా ? What do you mean?

శ— ఒక దివ్యమంత్రోపదేశంవల్ల నేను స్వచ్ఛందమరణాన్నే సాధించాను.

చి— నిజంగానా తాతయ్యగారూ ?

శ— నిజమే. నీవేకాదు, నేనుకూడా చిరంజీవినే.

తి— ఆమాట వింటుంటే నాప్రాణం ఇప్పుడే పోతున్నట్లు వుంది.

అ— నాగుండె పగిలిపోతున్నట్లు వుంది.

హా— ఓ! మైగాడ్ ! మీరు చిరంజీవులైతే మాకు తగనిచావు తెచ్చిపెట్టారు.

శ— నేనేంచేస్తాను నాయనా ? ఎవరి కర్మానుభవం వారిది.

అ— (తిరపతిని ఒకప్రక్కకు పిల్చి రహస్యంగా) ఏంచేధాం తిరపతీ ?

తి— (హాలును తనప్రక్కకు పిల్చి రహస్యంగా) ఏంచేదాం హాలూ ?

హా— నామట్టుకు నాకు ముసలాయన మాటల్లో నమ్మకం కుదరడంలేదు. I don't believe it.

తి— నాకూ అలానే అనిపిస్తూంది.

అ— చెప్పకపోవడమేం ? నా అనుమానంకూడా అదే.

హో— అయితే మనం ఈయన అంతు తేల్చుకోవాలి.
అ— అందుకు మనం ఇక్కడేవుండడం మంచిది.
తి— అదే నాఅభిప్రాయంకూడా.
హో— (తిరిగి శరభయ్యను సమీపించి) ఏమైనాసరే శరభయ్య గారూ. మిమ్మల్ని ఈస్థితిలో...
అ— వదలి వెళ్ళడానికి మాకు...
తి— మనస్సురావడంలేదు.
చి— ఎంత పరోపకారపరాయణత్వం!
శ— ఏమైనాసరే కాని నేనింతట్లో మీకు నా ఆస్తి ఇవ్వను.
తి— పోనీండి. "నందో రాజా భవిష్యతి!" రేపు ఏంజరుగు తుందో ఎవరికి తెలుసు?
అ— కాలం కర్మం కలసివస్తే— మీరు వద్దనుకొంటున్నా మీకు చావురాకూడదని ఎక్కడవుంది?
హో— కరక్టు! అంతవరకూ మేమిక్కడ వుండక తప్పదు.
శ— నాఇంట్లో మీరు వుండడానికి వీల్లేదు.
అ— మరెక్కడ వుండమంటారు?
శ— ఎక్కడైనా వుండండి.
తి— ఎక్కడైనా వుంటే మిమ్మల్ని గమనించడమెలా?
శ— నన్నెవరూ గమనించనక్కరలేదు.
హో— నో నో **We must take care of you.** మిమ్మల్ని గమనించకపోతే ఎంతటి ప్రమాదమైనా సంభవించ వచ్చు.

చి— మీకా? వారికా?

హా— ఎవరికైతే నీకెందుకు? ఇటీజ్ నాట్ యువర్ బిజినెస్.

చి— నాకెందుకు? ఊరికే తెలుసుకొందామని?

తి— పాపం, తెలిసికొందువుగానిలే తర్వాత!

శ— మీరేమైనాసరే, ఎంతమాత్రం నాఇంటిలో వుండడానికి వీల్లేదు.

అ— అయితేమమ్మల్ని ఎక్కడ చావమంటావు బావా?

శ— ఏట్లో.

హా— శరభయ్యతాతగారూ, అఫ్‌కోర్స్ కాటికి కాళ్ళుచాచిన మీరే చావడానికి ఒప్పుకోవడంలేదుకదా...

తి— మమ్మల్ని ఏటిపాలుకమ్మంటారా?

శ— ఏటిపాలు కాకపోతే ఏదో ఏడవండి, నాకెందుకు?

అ— మాఏడుపేదో మమ్మల్ని ఇక్కడే ఏడవనిద్దూ బావా.

శ— అది కుదరదు.

హా— అదే ఎందుచేత అని అడుగుతున్నాను.
**Why is it not possible?**

శ— ఇక్కడ మీఅందరకూ వంటావార్పూ చేసిపెట్టేందుకు ఎవరూ సిద్ధంగా లేరు.

అ— అందుకు నీవేం బాధపడకు బావా, మాకూ నీకూ కలిపి ఏకంగా వంటపని నేను చూసుకొంటానులే.

తి— అబ్బే, మీరెందుకు నేనుండగా? నాపాకం మీకు తెలియదేమో, నలభీమపాకం.

అ— ఆమాటకొస్తే నేను "పాకశాసనుణ్ణి".

శ— బాబూ, నాకు మీ పాకాలూవద్దు, శోకాలూ వద్దు. మీ దారి మీరు చూసుకోండి.

తి— అయితే ఏంచేద్దాం అనంతయ్యా ?

అ— ఏంచేద్దాం హాలూ ?

హా— ("మీరు ఉండండి" అన్నట్లుగా వారికి సంజ్ఞ చేస్తాడు) మీరంతగా పాడడం కే ఎలా శరభయ్యతాతగారూ.

తి— మీరే ఏదో దారి చూపించాలి.

హా— మాటదక్కించాలి ప్లీజ్.

అ— అన్నట్టు మీఇంటి తోటలో ఆమూల చిన్న ఇల్లు ఉందిగా ?

హా— అందులో వుంటాం.

తి— అనుమతించమంటాం.

అ— అనుగ్రహించమంటాం.

శ— నావద్ద మీరు సుతరామూ వుండడానికి వీల్లేదు.

తి— మీవద్ద కాదుగా శరభయ్యగారూ, ఒప్పుకోండి.

అ— మీరు కాదనకండి, మేం వెంటనే ఆఇంట్లోకి వెళ్ళిపోతున్నాం. పద హాలూ.

(అంటూ అనంతయ్యా, హాలూ, తిరపతీ లోపలివైపుకు నిష్క్రమణ)

శ— ("అమ్మయ్య" అని నిట్టూర్పువిడుస్తాడు). శివశివా! ఎరక్కపోయి చేసానురా భగవంతుడా, పత్రికలో ప్రకటన !

చి– పోనీ, ఆ వారసుల్ని మాత్రం బాధపెట్టడమెందుకు తాతయ్యగారూ.

శ– బాధపెట్టక ఏంచేయమని నీసలహా ?

చి– మీఆస్తి వారికి పంచి ఇచ్చివేయకూడదా ?

శ– చంద్రానికీ నాకూ ఏర్పడిన వైరం ఆధారంగాచేసికొని తమ స్వార్థాన్ని సాధించుకొనేటందుకు– నా చావును కూడా ఆసిస్తూ– నావద్దకువచ్చిన ఈనరరూప రాక్షసులకు నాఆస్తిని పంచమంటావా ?

చి– కొడుకును కాదనుకొన్నతరువాత మీఆస్తిని ఎవరికి పంచితే ఏం తాతయ్యగారూ.

శ– ఎంత కాదనుకొన్నా వాడు నాకు కొడుకే చిరంజీవీ, కొడుకే.

చి– అయితే వారసులకోసం ప్రకటన... ?

శ– ఎందుకు చేసానంటావా ?

చి– అవును.

శ– లేకపోతే ఏ మొహంపెట్టుకొని మళ్ళీ "చంద్రాన్ని" తిరిగిరా అంటూ ప్రకటన చేయగలను చిరంజీవీ ?

చి– అయితే నిజానికి ఆ ప్రకటనను మీ అబ్బాయికోసమే చేసారన్నమాట.

శ– కాక, ఈరాక్షసులకోసం చేసాననుకొంటున్నావా ?

చి– అయితే మీఅబ్బాయి తిరిగివస్తే– అతని తప్పిదాన్ని మరచి ఆప్యాయంగా ఆదరించగలనంటారా ?

శ— అబ్బాయిపై నా కభిమానముందని— అతడు చేసిన అనాచారపు పనిపై కూడా నాకభిమాన మనుకొంటు న్నావా ?

చి— అయితే మీరు చేయదల్చుకొన్న దేవిటి ?

శ— అదే నాకూ తెలియడంలేదు.

చి— మీ అబ్బాయిపై రాగమో, ద్వేషమో ఏదో ఒకటి నిర్ణయించుకోండి. అంతవరకూ మీసమస్య తీరదు.

శ— అంతేనంటావా చిరంజీవీ ?

(గోవిందయ్య వీధివైపునుండి ప్రవేశిస్తాడు)

గో— ముమ్మాటికీ అంతే శరభయ్యగారూ

శ— వచ్చావా గోవిందయ్యా, నీకోసమే ఎదురుచూస్తు న్నాను.

గో— ఇంతలో ఏంకొంపమునిగింది శరభయ్యగారూ ?

శ— నాకొంపే మునిగింది గోవిందయ్యా, కొంపే మునిగింది.

చి— నీళ్ళు లేకుండా ఎలామునిగిందండీ కొంప ?

శ— (కోపంగా) చిరంజీవీ

గో— నీవూరుకో చిరంజీవీ. ఇంతకూ ఏంవిటి శరభయ్య గారూ ?

శ— నీమాటలపై— పత్రికలలో ప్రకటన వేయించానా ?

గో— అవును, ఇప్పుడేంజరిగింది ?

శ— దాని ఫలితం ఇప్పుడు కనిపించింది గోవిందయ్యా.

గో— అంటే ? చంద్రం వచ్చాడా ? ఎక్కడున్నాడు ? ఎలా

వున్నాడు ? ఏడీ ?

శ— అబ్బబ్బ, నీతోందరే నీదికాని మరోటి వినిపించుకోవు కదా.

గో— ముందు అబ్బాయి ఎక్కడున్నాడో చెప్పండి, తర్వాత మాట్లాడుకొందాం

(అంటూ లోపలివైపుకు వెళ్ళబోతాడు)

చి— గోవిందయ్యగారూ, మీరు లోనికి వెళ్ళడం అనవసరం.

గో— ఏం ?

చి— వచ్చింది చంద్రం కాదు.

గో— మరెవరు ?

శ— నా వారసులు

గో— అంటే ?

శ— నా వారసులయ్యా, వారసులు.

గో— మీకెవరూ వారసులు లేరన్నారుకదా ?

శ— నేను లేరంటే సరా ? తాము ఉన్నామంటున్నారు.

గో— బహువచనం వాడుతున్నారు, ఎంతమంది వచ్చారు ?

శ— ఇప్పటికి ముగ్గురు ?

గో— ముగ్గురూ వారసులమే నంటారా ?

చి— మొదట్లో ఎవరికివారే శరభయ్యగారికి తామే ఏకైక వారసులమంటూ వచ్చారు. కాని ఇక్కడకు వచ్చిన తర్వాత ముగ్గురూ రాజీపడి— మూకఉమ్మడిగా శరభయ్య గారి వారసులమన్నారు.

గో— ఔరా! ఆస్తిపై ఆశ మానవుని ఎంత అధమస్థితికి దిగజారుస్తోంది!

(లోపలినుంచి "చిరంజీవీ, చిరంజీవీ" అన్న అనంతయ్య గొంతు)

చి— లోపలవాళ్ళెందుకో పిలుస్తున్నారు, చూసివస్తాను. (అంటూ లోపలికి నిష్క్రమిస్తాడు)

శ— గోవిందయ్యా, నీవే ఏదో ఉపాయం చెప్పాలి.

గో— ఎందుకు?

శ— వాళ్ళు పిశాచాల్లా నసేమీ నన్ను వదలి పోమంటు న్నారు.

గో— ఎక్కడున్నారువాళ్ళు?

శ— తోటలోని చిన్న ఇంటిలో వున్నారు. వాళ్ళు పోయే మార్గమేదైనా చూపించు గోవిందయ్యా?

గో— (వీధివైపు చూపిస్తూ) వచ్చినఈమార్గం నుండే వాళ్ళు తిరిగిపోవాలి. మరోమార్గం లేదుకదా.

శ— అదికాదు గోవిందయ్యా, వాళ్ళువదలిపోయే ఉపాయం చెప్పు.

గో— (ఆలోచన నభినయిస్తాడు) ఆఁ. ఒక్కసారి ఇలారండి.

శ— (అతనికి మరింత దగ్గరగా వెళతాడు)

గో— (శరభయ్య చెవిలో ఏదోఉపాయం చెప్పుట అభిన యిస్తాడు) చిరంజీవి రంగంలో ఒకవైపు నుండగా మఱొకవైపున వాళ్ళిద్దరూ ఏకాంతంలో రహస్యంభా

షణ నిర్వహిస్తారు) ఆఁ! అంతే! అలాచేయండి, జ్ఞాపకముందా.

శ_ (నవ్వుమొగంతో) ఓ భేష్షుగ్గా. అయినా ప్రొద్దుటనే వస్తావుకదూ?

గో_ తప్పకుండా వస్తాను. మీకు ప్రొద్దుపోయింది, భోజనం చెయ్యండి శెలవు (నిష్క్రమిస్తాడు)

శ_ శెలవు.

(అంటూ శరభయ్య లోనికి వెళుతూవుండగా చిరంజీవి అనుసరిస్తాడు)

—: తెర :—



# వారసుడు

## —: 2వ రంగము :—

మొదటిరంగం మాదిరిగానే వుంటుంది. ఉదయభానుని స్వర్ణకాంతిలో రంగం మెఱుపులీనుతూ వుంటుంది. తెర లేచేసరికి రంగం కాళీగా వుంటుంది. బైటనుంచి అనంతయ్యా, తిరుపతీ ప్రవేశిస్తారు.

అ— మొత్తానికి శరభయ్య భలే సమస్య తెచ్చిపెట్టాడు తిరపతీ.

తి— కాదామరి ? అంత ముసలివాడైకూడా తాను సనేమీ చావనంటాడు. ఇదేమైనా మర్యాదగా వుందా ?

అ— అబ్బెబ్బే, మర్యాద ఉంటే ఆమాట రానేరాదు.

తి— "వారసులు కావాలి" అని ప్రకటించి ఇప్పుడు వద్దు పొమ్మంటాడు, ఇదేమైనా న్యాయంగా వుందా ?

అ— అబ్బెబ్బే, అన్యాయం, పచ్చి అన్యాయం.

తి— అయినా అనంతయ్యా, మనలాంటి మంచివాళ్ళకు ఇవి రోజులుకావు లే.

అ— నీవు చెప్పింది నిజం తిరపతీ, ఈకాలంలో మంచివాళ్ళను అందరూ దగాచేయడమే.

తి— కాబట్టి మనంకూడా కొంచెం చెడ్డవాళ్ళమైపోవడం మంచిది.

అ— అంతేకాదు, "పాపీచిరాయుః" అన్నారు. మనం నాలుగు రోజులు బ్రతకాలంటే విధిగా చెడ్డవాళ్ళమైతీరాలి.

తి— నిజమేమరి. శరభయ్యగారు ఎన్ని పాపాలు చేయకపోతే ఇంతకాలం జీవించగలిగారు !

అ— అంతేకాదు, మనం ఎవ్వరిమూ వారసులం కామని ఎప్పుడైతే ఆయన బుకాయించి పాపానికి ఒడిగట్టాడో అప్పుడే ఆయన ఆయుస్సు పెరిగింది.

తి— నాకిది తోచనేలేదు సుమా. అందుకే నేను చస్తే చావను పొమ్మంటున్నాడు.

అ— అంటాడు అనడుమరీ, మనల్ని వెర్రివాళ్ళనుచేసి మరీ అంటాడు.

తి— అబ్బే, ఇలా కుదరదు, శరభయ్యగారి సంగతేమిటో మనం ఈవేళ పూర్తిగా తేల్చుకోవాలి.

అ— అదే నేననేదీను. ఇంతకీ "హాలు" ఇంకా రాలేదేం ?

తి— అతడు వచ్చినతర్వాత శరభయ్యగారి వ్యవహారం అమీతుమీ తేల్చుకోవడం మంచిది.

అ— అడుగో "హాలు" రానేవచ్చాడు.

(హాలు వీధివైపునుండి వస్తాడు.

హా— హాలో ! గుడ్ మార్నింగ్. మీరు నాకోసమే ఎదురు చూస్తున్నారా ?

తి— అవును. నీవు లేకపోతే మాకేమీ తోచదు హాలూ...

అ— నీవు లేకపోతే క్షణాలే మాకు యుగాలు.

హో— ఆపండి, అంతటితో చాలు.

తి— అయితే హోలూ, ఇక మన కార్యక్రమమేఁవిటి ?

అ— అదే నేనూ అడుగుతున్నాను.

హో— అదే నేనూ ఆలోచిస్తున్నాను. ఇంత సడన్‌గా శర భయ్య తన చావు ప్రోగ్రాం ఛేంజి చేసుకొంటాడను కోలేదు.

అ— నేనూ అనుకోలేదు.

తి— నేను అసలే అనుకోలేదు.

హో— సరా. ఆయన తన ప్రోగ్రాం కేన్సల్ చేసుకొన్నా— దాన్ని ఏదో విధంగా మనం జరిపించితీరాలి.

అ— ఎలా ?

తి— అదే ఆలోచిస్తున్నాను.

హో— తిరపతిశాస్త్రీ నీకు వైద్యం తెలుసా ? I mean medicine.

తి— అదేఁవిటి హోలూ, అట్లా అడుగుతావు? అసలువైద్యం పుట్టింది తికమకలవారింటనే.

అ— అలా అంటే నేనొప్పుకోను. మా తాత ముత్తాలు కూడా మహావైద్యులు.

తి— మీా తాతలమాట సరే, నీకు వైద్యం తెలుసా ?

అ— ఎటొచ్చీ నాకు తెలియదనుకో.

తి— వెనకటి కెవడో నీలాంటివాడే అన్నాడట. మాతాతలు నేతులు తాగారు. మామూతులు వాసనచూడండి అని.

అ— నాకు ఒక్కడికి వైద్యం చేతకానంతమాత్రాన మా ఇంటి పరువు పోతుందా ?

హా— ఇంటిపరువు దేవుడెరుగు ! ప్రస్తుతం పనిజరిగే విధానం ఆలోచించాలి. That is the point.

అ— అవునవును, ముందు అదికావాలి.

హా— తిరపతిశాస్త్రీ, నీకు వైద్యం బాగా వచ్చునా ?

తి— అందుకు సందేహమా ? ఏదీ నీచేయి ఇలా ఈయి. (అంటూ హాలు చేయిపుచ్చుకొని నాడిచూస్తూ వుంటాడు, హాలు నవ్వుకొంటూ వుంటాడు) మీకు పైత్య రసం ఎక్కువగా కనిపిస్తూవుంది. మీకు గుండెకూడా అప్పుడప్పుడు కొట్టుకొంటూవుంటుంది.

హా— Oh my god, అయితే అప్పుడప్పుడు నాగుండె ఆగిపోతూ వుందనా నీభావం !

తి— ముమ్మాటికీ.

హా— గుండె ఆగిపోతే నేనెలా బ్రతికిఉన్నానయ్యా ?

తి— అక్కడే అందరూ పొరబడుతున్నారు. గుండె ఆగినంత కాలం మనిషికి డోకాలేదు. అది ఎప్పుడు కొట్టుకోవడం ప్రారంభిస్తుందో అప్పుడే ముప్పు.

హా— చాలుచాలు, ఎవరేనా నవ్విపోగలరు ? గుండె ఆగిపోతే

బ్రతుకే లేదు.

తి— అదే పొరబాటు. పెద్దపెద్ద డాక్టర్లు రబ్బరు గొట్టాలతో రోగి గుండెల్ని ఎందుకు పరీక్షిస్తారనుకొన్నారు ?

హో— అవి కొట్టుకొంటున్నాయో లేవో చూడ్డానికి.

తి— అలా కొట్టుకోవడం ఒకజబ్బుకనకే గుండెల్ని చూడడం. ఆగిపోయిన గుండెల్ని చూడనేఅక్కర్లేదు.

హో— గుండె లాగిపోతే చావే. గుండె కొట్టుకొంటేనే లైఫ్! I mean బ్రతుకు.

తి— అని నీవంటి అమాయకుల్ని డాక్టర్లు నమ్మిస్తారు. నా ముందు చెప్పమను ఆ కబుర్లు, వెంటనే కడిగి పారవేస్తాను.

హో— తికమకలవారన్నందుకు పేరునిలబెట్టారు

తి— ఇంతకీ నామాటలు తికమక అంటారా ?

హో— ముమ్మాటికీ

తి— ఎన్నటికీ కాదు

హో— పోనీలెండి, మీరు వైద్యంచేయవలసిన దుర్గతిలో నేను లేను. Do you understand ?

అ— అయితే ఆదుర్గతిలో వున్నదెవరు ? నేనా ?

హో— నీవూకాదు, నేనూకాదు. శరభయ్యగారు.

తి— అయితే నన్ను శరభయ్యగారికి వైద్యం చేయమంటారా ?

హో— Correct, చేయలేవా ?

తి— చేయలేకేం? చిటికెలో చేస్తాను. ఇంతకీ ఆయన రోగం?

హా— బ్రతికి వుండడం.

తి— అంటే మీ ఉద్దేశం?

హా— ఏముంది? మీ చేతిమాత్ర ఆయనకు వైకుంఠయాత్రగా పనిచేసి అందరకూ తరణోపాయం చూపించాలి. That's I want.

తి— చూస్తూ చూస్తూ అంతపని చేయలేను హాలూ?

హా— చేయలేకపోతే నీ వారసత్వానికి నీళ్ళు వదలుకొని వెంటనే ఇంటికిపోవడం మంచిది. You better to go

తి— అనంతయ్యా ఏంచేయమంటావు?

అ— సందేహిస్తావేం తిరపతీ! ఊఁ అను.

తి— సరే, మీరిద్దరూ అలా చెపుతుంటే నేనెలా కాదనగలను?

హా— All right, అయితే శరభయ్యగారు రాగానే నీ వైద్యం ప్రారంభించు.

తి— అలాగే.

హా— నీమాత్రకు మళ్ళీ తిరుగుండకూడదు. అంత అమోఘమైన మాత్ర వాడాలి. Do you understand?

తి— నీవే చూస్తావుగా నామాత్ర మహిమ!

అ— నెమ్మదిగా మాట్లాడవయ్యా, ఎవరైనా వినిపోగలరు!

హా— అవునవును. ఈఇంటి నౌకరు చిరంజీవి చూసారూ, వాడో చలిపిడుగు.

(లోపలినుంచి చిరంజీవి ప్రవేశిస్తాడు).

చి— ఏవిటి హోలూ, నాగురించి ఏదో అంటున్నావు ?

హో— No No, Nothing. చిరంజీవి పిడుగులాంటివాడు అంటున్నాను.

చి— అసలు నేనెటువంటివాడినైతే నీకెందుకు ?

హో— Of course, మనుష్యుల మంచిచెడ్డలు మాట్లాడుకోవడం మామూలేకదా !

అ— అంతే, అంతే. చిరంజీవి పిడుగేఁవిటి ? పిడుగులనే పిండిగొట్టగల మహాపిడుగు అంటున్నాను.

తి— కాదామరి ?

చి— ఇది గ్రహించడానికి మీకింతకాలం పట్టిందా ? పాపం!

తి— నేను పైకనలేదుగాని చిరంజీవీ, నిన్ను చూసినప్పుడే నీవెటువాడవో గ్రహించాను.

హో— Yes, Yes. నీవు ఘనవైద్యుడవు కదామరి ?

తి— అవునవును. అటువంటి శక్తి వైద్యులకేకాని అందరికీ అలవడుతుందా ?

చి— మీరు వైద్యులా తిరపతిగారూ ?

అ— ఇంకా నెమ్మదిగా అంటావేం ? మహావైద్యులు.

హో— పూర్వం వీరి తాతముత్తాతలందరూ మహారాజ సంస్థానాల్లో రాజవైద్యులుగా రాణించేరు. What do you think of him ?

అ— కాబట్టి మన శరభయ్యగార్ని తిరపతిగార్కి ఒకసారి చూపిస్తే బాగుంటుందేమో.

హో- Certainly.

చి- ఇంతకీ శరభయ్యగారికి ఇప్పుడు వైద్యమెందుకండీ ?

తి- అబ్బెబ్బే, అలాఅనకండి. వైద్యం కావలసింది వార్ధక్యం లోనే.

అ- మరే మరే. పసుముదనంలో వైద్యం అక్కర్లేనే లేదు.

చి- ఇంతకూ మీరు శరభయ్యగారికి వైద్యం చేస్తామం టారు ?

తి- తీరా వచ్చినతర్వాత ఏదో వైద్యం చేయకపోతే బాగుం టుందా చెప్పనాయనా.

అ- ఏదో వైద్యమంటూ రేఁవిటంకీ, గట్టివైద్యమే చేయండి.
(నెమ్మదిగా లోపలినుంచి శరభయ్య ప్రవేశిస్తాడు)

శ- వైద్యం ఎవరికిరా చేయడం ?

హో- మీకే తాతయ్యగారూ. For yourself.

శ- నాకెందుకురా వైద్యం ? పిడుగులా వుంటే !

తి- పిడుగులా వుండడమే ఒక రోగం శరభయ్యగారూ, మీకు తెలియదు.

శ- అయితే ఎలా వుండాలంటావు తిరపతీ ?

అ- రోగం కాకపోతే మూడుకాళ్ళ ముసలితనంలో మీరు పిడుగులా వుండడమేఁవిటండీ ?

శ- అందుకు మీరంతాకలసి నన్ను పీనుగును చేస్తారా ఏఁవిటర్రా.

హా— ఎంతమాట! ఎంతమాట! అయినవాళ్ళ మయినందుకు మమ్మల్నిలా అనడం మీకు బావుందా?

శ— నాకు రోగంలేనిదే వైద్యం చేస్తాననడం మీకు బావుందా?

అ— మీరు వైద్యం చేయించుకోవడం మాకోసమటండీ?

హా— Of course మీరు పదికాలాలపాటు బ్రతికితే మా కొరిగే దేఁవిటండీ?

చి— అది నిజమే. మీరు చస్తే వారికేదైనా వొరుగుతుంది కాని, మీరు బ్రతికితే వారికేం వొరుగుతుందిపాపం!

శ— అందుకు అందరూకలసి నన్ను చంపివేస్తారా ఏం?

తి— రామరామ! ఎంతమాట! ఏదో పుణ్యానికిపోతే పాపం ఎదురయ్యిందట!

శ— అయితే ఇంతకీ ఏంచేస్తానంటావ్?

తి— ఒక్కసారి మీచేయి ఇలా ఇవ్వండి. (అంటూ అతని చేయిపుచ్చుకొని నాడి చూస్తూ వుంటాడు)

శ— ఇంతకీ నారోగమేఁవిటంటావ్ తిరపతీ.

తి— (మాట వినిపించుకోకుండా దీర్ఘాలోచన నభినయిస్తాడు) ఆఁ ఏవన్నారు?

శ— నారోగం ఏఁవిటంటున్నాను?

తి— అబ్బో, మీకున్నది ఒకరోగంకాదు. అనేక రోగాలకు మీశరీరం నిలయమైపోయింది.

హా— కొంచెం వివరంగా చెప్పు తిరపతీ.

తి— అంటే శరభయ్యగారి శరీరంలో ప్రస్తుతం వాతపిత్త శ్లేష్మపైత్య ఇత్యాది దుర్గుణాలు బాగా ప్రకోపించి వున్నాయి. మీకు మునుపటివలె జవసత్వాలున్నాయా శరభయ్యగారూ ?

శ— లేవు.

తి— దూరంగావున్న వస్తువులు మీకు కనిపిస్తాయా ?

శ— కనిపిస్తాయి.

తి— బాగా దూరంగా వున్నవి ?

శ— కనిపించవు. గోడవతలి వస్తువులుకూడా కనిపించవు.

తి— చూసారా ? నేననుకొన్నది నిజం అన్నమాట. మీరు పరుగుపెట్టగలరా ?

శ— పెట్టలేను.

తి— మీరు ఎక్కువగామాట్లాడినప్పుడు మీకు ఆయాసం వస్తుందా ?

శ— వస్తుంది.

తి— మీకప్పుడప్పుడు కాళ్ళూ చేతులు లాగడం, తలనొప్పి వంటివి సంభవిస్తుంటాయా ?

శ— అవును.

తి— ఇవన్నీ జబ్బులక్షణాలు కాకపోతే మరేవిటండీ ?

హా— తిరపతిశాస్త్రి అంటే ఏమోఅనుకొన్నాను గాని— రోగాన్ని చాలాగొప్పగా డయాగ్నైజు చేసారే.

అ— ఈరోగాలన్నీ కుదర్చడానికి మీరు చాలాశ్రమపడవలసి వుంటుందేమో...

తి— అబ్బే ఎందుకు? ఒక్కమాత్ర చాలు, శరభయ్యగారి సర్వరోగాలూ సమూలంగా తుడిచిపెట్టడానికి.

హా— అయితే సందేహిస్తారేం? వాడండి.

తి— (తన జేబులోంచి ఒక చిన్న మందులపెట్టి తీసి అందులోని ఒక పొడుంపొట్లం విప్పి మరొక చిన్నకాగితం లోనికి వేసి వణుకుతూ అది పొట్లంకడతాడు) ఈ ఒక్క పొట్లం మీరు సేవించి చూడండి. ఒక గంట గడిచేటప్పటికి...

హా— మీ సమస్తబాధలూ సమసిపోతాయి.

అ— ఇందుకు అనుపానం ఏమైనా వుందా తిరుపతీ

తి— ఏమీ అక్కర్లేదు. పోనీ, పాలతో కలిపి సేవించండి చాలు.

చి— అది ఇలా ఇవ్వండి, నేనిస్తాను.

తి— నీవెందుకు? నేనే ఇస్తాన్లే.

చి— మీకెందుకా శ్రమ. నేనిస్తాన్లెండి.
(అంటూ ఆపొట్లం తను తీసికొంటాడు)

అ— ఇంకా నిలబడివున్నావేం, పాలు తీసుకురా.

హా— పొట్లం అక్కడవుంచి పాలుతీసుకురా.

చి— నేనే కలిపి తెస్తానులెండి. (అంటూ లోనికి నిష్క్రమిస్తాడు)

తి— శరభయ్యగారూ, అదిసేవించి కాస్సేపు హాయిగా నిద్రపొండి.

ప్ర— అవునవును, నిద్రపోవడం అవసరం.

హా— మీరెంత దీర్ఘంగా నిద్రపోతే అంతమంచిది.

అ— శరభయ్య బావా. ఇక మాభయం తీరిపోయిందనుకో.

శ— నీకు భయమెందు కనంతయ్యా ?

హా— మీరు "నాకెంతగా చావురాదని" చెప్పతున్నా మీ old age చూస్తే- మాకు భయంగానేవుండేది.

తి— ఇకమీకాభయం అక్కర్లేదు. శరభయ్యగారికిక స్త్రోకా లేదు. పరిపూర్ణమైనమార్పు మీకు లభిస్తుంది.

అ— మరేమరే బావా, నీవు పునర్జన్మ ఎత్తుతావనుకో.

హా— కరక్టు! శరభయ్యతాతగారూ—కరక్టు.
(ఇంతలో చిరంజీవి పాలు తెస్తాడు)

తి— మందు ఏదీ ?

చి— ఇందులో కలిపాను.

హా— అయితే వెంటనే ఇవ్వు.

చి— (పాలగ్లాసు శరభయ్యగారి చేతికిస్తాడు)

శ— (పాలు త్రాగుతాడు)

అ— ఎలావుంది శరభయ్య బావగారూ ?

శ— బాగానే వుంది.

హా— ఇక బాగానే వుంటుందిలెండి!
**It will be very fine.**

తి— అనంతయ్యా, హాలూ, మనం ఒకసారి అలా బజారుకు వెళదామనుకొన్నాంగదూ, వెళదామా ?

అ— ఆఁ ఆ! పదండి వెళదాం.

(అంటూ ముగ్గురూ వీధివైపు నిష్క్రమిస్తారు)

శ— చిరంజీవీ, నాకు వీళ్ళేం విషం ఈయలేదుకదా !

చి— వాళ్ళు ఇచ్చింది విషమేనండీ.

శ— అమ్మయ్యో, ఇప్పుడెలా చిరంజీవీ, నేను చచ్చిపోతానే! వెంటనే వెళ్ళి మన గోవిందయ్యగార్ని తీసుకురా చిరంజీవీ.

చి— కంగారుపడకండి తాతయ్యగారూ

శ— అయ్యో, ప్రాణంపోతూంటే కంగారుపడొద్దంటావేమిటి చిరంజీవీ, వెంటనే వెళ్ళు.

చి— వెళ్ళవలసిన పనిలేదండి. మీరేం బాధపడకండి.

శ— అయ్యయ్యో, నీకుకూడా నన్ను చంపివేయాలనివుందా చిరంజీవీ.

చి— లేదండి.

శ— మరి ?

చి— లేదుకనుకే మీకా విషం ఇవ్వలేదు.

శ— ఏఁవిటి, నాకు విషం ఇవ్వలేదూ ? నిజమే ?

చి— నిజమే తాతయ్యగారూ !

శ— మరి వాళ్ళిచ్చిన విషమేంచేసావు ?

చి— అది వేరేపాలల్లో కలిపి మన దొడ్డిగుమ్మంలోకి అప్పుడే

వచ్చిన ఊరకుక్కపిల్లకిచ్చాను.

శ- అయ్యో, నిష్కారణంగా ఆ కుక్కపిల్లని చంపివేసావా ?

చి- అవును. అది విషమో కాదో తెల్సుకోవాలను కొన్నాను, అందుకే అలా చేయవలసివచ్చింది.

శ- కుక్కపిల్ల వెంటనే చనిపోయిందా ?

చి- పాలుత్రాగిన మరుక్షణంలోనే విలవిల్లాడుతూ ప్రాణం విడిచింది. చూస్తారా ?

శ- ఎందుకులే ! నీవు రక్షించబట్టిగాని లేకపోతే నేనీపాటికి ఎక్కడవుందునో !

చి- అంతా భగవంతుని దయ తాతయ్యగారూ. ఇందులో నేనుచేసిందేమీ లేదు.

శ- అసలు అది విషమేమోననే అనుమానం నీకెందుకు కలిగింది చిరంజీవీ !

చి- మీరురాకముందు ఆముగ్గురి మాటలూ నేను రహస్యంగా వినడం జరిగింది. తిరుపతిదగ్గఆ విషంతో వారు మీప్రాణాలు తుదముట్టించి - మీ ఆస్తిపాస్తులు దక్కించుకోవాలని పన్నాగంపన్నారు.

శ- శివశివా ! కాలం ఎంత చెడిపోయిందిరా భగవంతుడా ! నాఆస్తికోసం నాప్రాణాలు తీసివేయాలా ?

చి- కాక మరెవరిప్రాణాలు తీసివేయాలి ?

శ- ఆస్తికోసం ఇంతటి అమానుషానికి ఒడిగడతారనే సంగతి నాకింతవరకూ తెలియదు చిరంజీవీ- తెలియదు.

చి- పోనీలెండి, వాళ్ళవిషయంలో కొంచెం జాగ్రత్తగా వుండండి, చాలా ప్రమాదకరమైన వ్యక్తులు.

శ- ఇంకా అజాగ్రత్తగా వుంటానా చిరంజీవీ. అయినా నీవున్నావుగా నన్ను కనిపెట్టడానికి.

చి- అదుగో, గీతాల గోవిందయ్యగారు వస్తున్నారు.

శ- వస్తున్నారా, వారికోసమే ఎదురుచూస్తున్నాను. (గోవిందయ్య ఒక కాగితాలకట్ట చంకనుంచుకొని వీధి వైపు నుండి ప్రవేశిస్తాడు)

శ- రా గోవిందయ్యా, కూర్చో. చిరంజీవి దయవలన గండం తప్పిపోయినది కాని లేకపోతే నేను నిన్ను చూడ లేకపోయేవాడిని సుమా!

గో- ఏం? ఏంజరిగింది?

చి- ముగ్గురు వారసులూ శరభయ్యగారికి విషప్రయోగం చేయ సంకల్పించారు.

గో- (ఆదుర్దాగా) చేసారా?

శ- లేదు, చిరంజీవి దానిని తప్పించేడు.

గో- చూసారా? చిరంజీవిని మొదట మీరు మీవద్ద నౌకరుగా ఉంచుకోవడానికి సందేహించారు.

శ- అవును.

గో- నేడు అతడే మీప్రాణాలు కాపాడాడు. మనిషిలో చూడవలసింది మంచితనాన్ని; అతని కులగోత్రాల్ని కాదు.

శ- నీవన్నట్టే నిజం గోవిందయ్యా.

గో- దానికేంగాని ఇంతకూ ఆ ప్రబుద్ధు లెక్కడ ?

చి- బహుశా వారు శరభయ్యగారి మరణావస్థనంతనూ కళ్ళారా చూడ్డమెందుకని బైటకు వెళ్ళారు.

శ- తాము వచ్చేటప్పటికి నేను కన్నుమూసివుంటే- అన్నీ కాజేసుకుపోదా మనుకొనివుంటారు.

గో- అయితే ఇప్పుడేంచేదాం ?

శ- ఏముంది ? మన మామూలు కార్యక్రమం వుందిగా, కానివ్వండి.

గో- చిరంజీవీ, కొంచెం మంచినీళ్ళు తే నాయనా
(చిరంజీవి నిష్క్రమిస్తాడు)

గో- (రంగంలో ఒకమూల వున్న చిన్నబల్ల తెచ్చి రంగం మధ్యగా వుంచుతాడు. దానిపై భగవద్గీత వుంటుంది. ఆబల్లముందు కూర్చుంటాడు, అతనిప్రక్కనే శరభయ్య కూడా కూర్చుంటాడు. భగవద్గీతకు నమస్కరించి కళ్ళకు అద్దుకొని పుస్తకం తెరుస్తాడు)

" పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చదుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే. "

(తొలిచరణం చదివేసరికి చిరంజీవి మంచినీళ్ళు తెచ్చి గోవిందయ్యకిస్తాడు. ఆతడు అవి పుచ్చుకొని తిరిగి

శ్లోకం మొదలుపెడతాడు. రెండవచరణం చదివేసరికి నెమ్మదిగా హాసూ, అనంతయ్యా, తిరుపతీ ఒకరివెనుక ఒకరు ప్రవేశించి రంగానికి ప్రక్కగానే వుండి గీతా పారాయణం విని విస్తుపోయి ముక్కుపై వేలుంచు కొంటూరు)

గో– "సాధుజనులను సంరక్షించుకొఱకును, దుష్టులను సంహరించుకొఱకును, ధర్మమును పునరుద్ధరించుకొఱకును యుగయుగమ్ములందును భగవంతుడనగు నేను జన్మించుచుందును" ఆహాహా! యుగధర్మాన్ని, తన అవతారహేతువునూ ఎంతచక్కగా వ్యక్తీకరించాడీ శ్లోకంలో శ్రీకృష్ణపరమాత్మ.

శ– అయితే గోవిందయ్యా నేను ఈకలియుగంలోనే దుష్టులున్నారనుకొంటున్నాను. అన్నియుగాల్లోనూ వున్నారా గోవిందయ్యా.

గో– ఉన్నారుకాబట్టే భగవంతుడిన్ని అవతారా లెత్తవలసి వస్తోంది.

శ– అయితే గోవిందయ్యా, ఈకలియుగంలోని దుష్టుల్ని సంహరించేటందుకు భగవంతు డెప్పు డవతరిస్తాడంటావు ?

గో– అవతరిస్తాడు శరభయ్యగారూ, పాపాలు పండవద్దా ?

శ– ఇంకా ఏంపండాలి గోవిందయ్యా, ఆస్తికోసం తండ్రీ కొడుకులమధ్య వైరాలుపుట్టిస్తున్నారు. వాళ్ళను వేరు

చేస్తున్నారు. ఆస్తినిచూసి- బంధుత్వం లేకపోయినా "తెప్పలుగ చెరువునిండిన కప్పలు పదివేలు చేరు" అన్నట్లుగా వారసులమంటూ తయారై, వద్దన్నా మీదకూర్చుంటున్నారు. కాదుపొమ్మంటే విషమైనా ఇచ్చి ప్రాణాలు తీసి ఆస్తి పట్టుకుపోవాలనుకొంటున్నారు. ఎవరి మొహాన చూసినా మోసం, దగా, వంచనా తాండవమాడుతూ వుంటాయి. పైకి కనిపించే దుష్టులు కొందరు. కనిపించని దుష్టులు కొందరు. దుష్టులు, దుర్మార్గులు, ద్రోహులు విజృంభించి పోతున్నారు గోవిందయ్యగారూ. వీరు ఎప్పుడు నాశన మవుతారు ?

గో- నాశనమవుతారు శరభయ్యగారూ, నాశనమైపోతారు. మీరు ఆవేశపడకండి.

హా- శరభయ్య తాతగారూ ఇప్పుడెలా వుందండీ ?

శ- తిరపతిశాస్త్రి ధర్మమాఅని నాకిప్పుడు చాలా బాగుందోయ్ హాలూ.

హా- (ఏమిటన్నట్లుగా అనంతయ్యవైపు చూస్తాడు)

అ- (ఏమిటన్నట్లుగా తిరపతివైపు చూస్తాడు)

తి- (ఏమీఅర్థంకాక అయోమయం ముఖంపెడతాడు) ఏమండీ శరభయ్యగారూ, ఆమందు త్రాగినతర్వాత మీకు కలిగిన మార్పు లేమిటండీ.

శ- మందు మహిమ ఎటువంటిదోకాని తిరపతీ బ్రహ్మాండం

గా పనిచేసిందనుకో. అది పుచ్చుకొన్న వెంటనే నా కెక్కడలేని సత్తువా పుట్టుకొచ్చింది. ఎక్కడలేనిశక్తి వచ్చింది, ఎక్కడలేని బలమూ ఏర్పడింది. నాకు పరిపూర్ణమైన మార్పు లభించింది. నీమేలు మర్చిపోలేనోయ్ తిరపతీ.

అ— ఇంతకీ బావా...

శ— నేను పునర్జన్మ ఎత్తాననుకో.

(ఆమాటలకు హాలూ, అనంతయ్యా, తిరపతీ ఒకరి మొగాలు ఒకరు చూసుకొంటూ వుంటారు. తిరపతి ఆముదంత్రాగిన మొగం పెడతాడు)

శ— ఇక శారీరక ఆరోగ్యం విషయంలో ఎంతమాత్రం దిగులులేదుకాని తిరపతీ...

గో— సందేహిస్తారేం? ఇక మీదిగులేఁవిటో చెప్పండి.

శ— నాకు మానసికమైన దిగులుమాత్రమే మిగిలిపోయింది.

తి— అదికూడా ఏఁవిటో చెప్పండి, చిటికలో కుదురుస్తాను.

శ— అది నీవు కుదర్చలేవు తిరపతీ, నేనే కుదుర్చుకోవాలి.

హా— అలా అనకండి శరభయ్య తాతగారూ, మన తిరపతి శాస్త్రిగారు కుదర్చలేని వ్యాధంటూ "వరల్డ్" లో లేదు.

తి— అసలు మానసికరోగాలకు మనదే పెట్టింది పేరు.

అ— అయితే సందేహిస్తావేం బావా చెప్పు.

శ— ఇందుకు తిరపతి మాత్ర పనిచెయ్యదు అనంతయ్యా.

హా— అలా అనకండి శరభయ్యా తాతగారూ. తిరపతీ, మరో మాత్ర వాడిచూడవోయ్. ఈమాత్రతో శరభయ్యా గారి వ్యాధులన్నీ కంప్లీటయిపోవాలనుకో.

అ— ఇదిగో తిరపతీ, యిందాకటివంటి మాత్ర వాడకు. ఈమాత్రతో నీపేరు మ్రోగిపోవాలనుకో.

తి— నాకు తెలీదా? మీరు మళ్ళీ చెప్పాలా? ఇదిగో శరభయ్యా గారూ, మరోమాత్ర యిస్తాను వాడిచూడండి.

శ— ఎందుకు తిరపతీ, వృథాశ్రమ. ఆ ఒక్కమాత్రే నాకు చాలు, బాగా పట్టిచ్చింది. యిక వేరేమాత్రలువద్దు.

తి— మీకెందుకు? యిది వాడి చూడండి, మీకు మరీ బావుంటుంది.

శ— వద్దు, నాకేవీవద్దు.

అ— మీరలాఅంటే మేమేంకావాలి బావగారూ, మా మాటవిని పుచ్చుకోండి.

శ— వద్దు అనంతయ్యా, నాకేఁవీ వద్దు.

హా— మీరలాఅంటే మాకేదో గాభరాగావుంది. శరభయ్యా తాతగారూ, ప్లీజ్ టేకొట్.

శ— గాభరాపడకునాయనా, నాకేఁవీ భయంలేదు.

తి— మీరలా అనకండి శరభయ్యాగారూ, ఈ ఒక్కసారే వాడిచూడండి.

శ— నాకేఁవీవద్దు తిరపతీ.

చి— రోగి వద్దంటే మాత్ర వేస్తానంటావేమిటయ్యా తిరపతీ.

తి— మా బాధ నీ కేం తెలుసు పోవోయ్.

చి— రోగి బాధకంటే మీ బాధ ఎక్కువగా వుంది. పోనీ ఆమందు మీరు ముగ్గురూ వేసికోకూడదా?

హ— మా కెందుకోయ్, నిక్షేపంలా వుంటే?

అ— మరే, అది శరభయ్యగారికి కాని మన కెందుకూ?

తి— అది శరభయ్యగారి శరీరతత్వాని కేగాని అందరికీ సరి పడదు.

గో— ఆయన వద్దంటున్నప్పుడు మీ రేంచేస్తారు? పోనీలెండి. శరభయ్య గారిపై మీ ఆదరాభిమానాలు చూస్తూ వుంటే నాకు చాలా ముచ్చట వేస్తూంది.

అ— ఏదో కావలసినవాళ్ళం కాబట్టి ఇంత ఇలా ఇదవు తున్నాం. అంతేనండి మరో టేంకాదు.

గో— అవును, మీవంటి వారసులుండగా శరభయ్యగారు ఎందుకు మానసికంగా బాధ పడుతున్నారో నాకర్థం కాదు.

హ— Yes, Yes, మేమందరమూ వుండగా శరభయ్యగారికి బాధేవిటండీ?

అ— అదిఏవిటో తెలిస్తే చిటికలో తీర్చమా?

తి— ఒక్కమాత్రతో శరభయ్యగారి అన్ని శరీరరోగాలు కుదిర్చానా? వారి మానసిక బాధ కుదర్చకపోతానా?

చి— ఇంతకూమీకున్న బాధేవిటండీ శరభయ్యతాతగారూ?

శ— అబ్బే, ఏఁవీ లేదు. (అంటూ నసుగుతాడు)

గో— వారు మీతో చెప్పడానికి సిగ్గుపడుతున్నారు అంతే.

అ— మాతో చెప్పడానికి సిగ్గెందుకండీ ?

తి— మేంపరాయివాళ్ళం కాముగా ?

హ— కరెక్ట్. అయినవాళ్ళమేగా ?

గో— కావలసినవాళ్ళు అంత గుచ్చి గుచ్చి అడుగుతుండగా మీారు చెప్పకపోవడం భావ్యంకాదు, చెప్పండి.

శ— చెప్పి ప్రయోజనంలేదు గోవిందయ్యా, వాళ్ళను బాధ పెట్టడం తప్ప.

అ— అదేంవిటి బావగారూ ? మీాకోసం ఎటువంటి బాధ నైనాసరే భరించడానికి సిద్ధంగావున్నాను.

తి— శరభయ్యగారూ, మీారు సందేహించకండి. మీాకోసం నాసర్వస్వాన్ని త్యాగంచేస్తాను.

హ— శరభయ్యగారూ మీాప్రాణానికి నాది హామీ. మీా కోసం నా "లైఫ్" ధారపోస్తాను.

గో— చూసారా శరభయ్యగారూ, వాళ్ళు అంతగా చెపు తుంటే — మీారు మాట్లాడకపోవడం బాగాలేదు.

శ— పోనీలే గోవిందయ్యా, ఏది ఎలాజరగవలసివుంటే అది అలా జరుగుతుంది.

గో— చివరికంతేననుకోండి. కావలసినవాళ్ళు మనకోసం ఇంతగా కొట్టుకొంటున్నప్పుడు మనం వాళ్ళను చిన్న బుచ్చడం మంచిపనికాదు.

శ— నీపిచ్చికాని గోవిందయ్యా వాళ్ళందరూ మర్యాదకోసం అలా అంటున్నారు కాని

గో— నిజంచెపితే ఎవ్వరూ నిలబడరంటారా? ఏమోలెండి అదినాకేం తెలుసు?

హ— (కోపంగా) గోవిందయ్యా...

గో— ఏం బాబూ...

హ— నాపేరేమిటో ఎరుగుదువా?

చి— బురదగుంటల వీరవర హాలు.

గో— తెలిసిందిబాబూ తెలిసింది.

హ— ఇచ్చినమాటతప్పడం ఈశ్వరునకైనా సాధ్యమేమో కాని ఈ హాలుకు సాధ్యంకాదు.

గో— మీరొక్కరు వుంటే చాలా బాబూ? లోకంలో అందరూ మీవంటివాళ్ళుంటవస్తూ?

అ— ఎవరిమాటో మనకెందుకుగాని గోవిందయ్యా శరభయ్యగారి కోసం నేను నిప్పుల్లో దూకడానికైనా వెనుదీయను.

తి— గోవిందయ్యా శరభయ్యగారికోసం నేను చావుకైనా తెగిస్తాను నీకు తెలియదేమో.

గో— ఇంకా సంకోచమెందుకండీ శరభయ్యగారూ చెప్పండి.

శ— నావల్లకాదు నీవేచెప్పు గోవిందయ్యా.

చి— పోనీ మీరుచెప్పండి గోవిందయ్యగారూ. ఇంతకూ వారికి వచ్చిన ఇబ్బందేమిటి?

గో— కడకునన్నే చెప్పమంటున్నారా? సరే ఎంచేస్తాను అంతా శ్రద్ధగా వినండి. చంద్రం శరభయ్యగార్ని వదలివెళ్ళి

దాదాపు ఇరవై ఏళ్ళయింది. ఈఇరవై సుదీర్ఘ వత్సరాలలోను శరభయ్యగారి జీవితంలో చాలా మార్పులు జరిగాయి.

అ— అవునవును. నేను దూరంగా వున్నప్పటికి — ఎప్పటి కప్పుడు వాకబు చేస్తూనే వుండేవాడిని.

శి— ఎవరైనా ఈవూరునుంచి వచ్చారని తెలిస్తే చాలు, శరభయ్యగారి యోగక్షేమాలు అడక్కుండా వదలి పెట్టేవాణ్ణి కాను.

హా— ఏదో మునలివాడుకదా ఆయన ముందుకు వెళ్ళితే ఏమనుకొంటాడో అని — ప్రత్యేకించి ఈవూరికి వచ్చి శరభయ్యగారివద్దకు రాకుండానే పరోక్షంగానే వీరి సంగతులు కనుక్కొని వెళ్ళిపోతూ వుండేవాడిని.

చి— అంత రహస్యంగావచ్చి పోయేవాడివి ఈనాడెందుకు ఇంతపబ్లిగ్గా వచ్చావు.

హా— విధిలేక. వారసులను తను స్వయంగా కలుసుకోమన్నం దున — ఒకవేళ నేను కలుసుకోకపోతే శరభయ్యతాత గారు ఎక్కడ Suffer అవుతారో అని వచ్చేను. తెలిసిందా ? ఇక చెప్పండి గోవిందయ్యగారూ.

గో— మీరెంతగా శరభయ్యగారి యోగక్షేమాలు విచా రించుకొంటూ వచ్చినా — ఆయన నిజస్థితి మాత్రం ఆయన దగ్గరగా మసలినవాళ్ళకు తప్ప మరొకరికి తెలి యదు. ఈ ఇరవై ఏళ్ళలోను మీరాయనవద్దకు

తరచు వచ్చి వుండకపోవడంవల్ల నారి ప్రస్తుత స్థితి మీకర్థంకాదు.

అ— గోవిందయ్యగారూ మీరు నమ్మండి నమ్మకపోండి ఈమధ్య ఏరోజుకారోజు మా శరభయ్య బావదగ్గరకు గావాలని ప్రయాణమవడం — ఏదో అడ్డంకి ఏర్పడ్డం మానివేయడం — ఇలాగే గడచిపోయాయనుకోండి ఇన్నివేళ్ళూ.

తి— బైలుదేరేటప్పుడే అడ్డంకులేర్పడి నీవు మానివేసావు. కాని నేను వారిని చూడాలని ఎప్పటికప్పుడు ఇటీవల బైలుదేరి కొంతదూరం వచ్చి మార్గమధ్యంలో ఎవరో ఒకరు వైద్యంకోసం ఆపుచేయడంతో విరమించుకో వలసివచ్చేది.

హా— నేను ముందు చెప్పానుగా. నాకు శరభయ్యగారిమీద వుండే భక్తి గౌరవాలవల్ల — నేనీవూరు వచ్చినా ఆయనసంగతులు వాకబుచేసుకొని—ఆయనకు తెలియ కుండానే వెళ్ళిపోయేవాడిని. That is my policy.

గో— అందువల్లనే — నేటిఆయన పరిస్థితి మీకర్థంకాకుండా పోయింది.

అ— అయితే ఇప్పుడు ఆయన పరిస్థితి ఏమిటి ?

హా— That is also my question. మేమింతకాలం వచ్చి చూడకపోయినంతమాత్రాన మాకు అర్థంకాని కొత్త పరిస్థితి ఏం ఏర్పడింది ?

తి— ఒకవేళ ఏదైనా రోగంవుండి — అది ఈ కాలంలో ముదిరిపోయిందనా మీ భావం ?

చి— రోగం ముదిరినా కుదర్చగలవారు తమరుండగా ఆయన కేంలోటు ?

తి— ఆఁ అదే అదే అనబోతున్నాను.

గో— ఆయనకు ముదిరినది రోగంకాదు.

హో— మరి ?

గో— దారిద్ర్యం !

అ. & తి. & హో.— (ఒక్కసారిగా కలసి) శరభయ్యగారికి దారిద్ర్యమా ?

గో— అవును, విడిచిపెళ్ళిపోయిన తనకొడుకుపై విరక్తితో ఆయన తన ఆస్తినంతటినీ విచ్చలవిడిగా ఖర్చుపెట్టారు. ఎవరికోసం ఈఆస్థిపాస్తులు జాగ్రత్త పెట్టాలనే నిరాశతో తన ధనాన్నంతటినీ దాన ధర్మాలకు వెచ్చించి వేసారు. అడిగినవాళ్ళకు లేదనకుండా వుండడంకోసం అప్పులుకూడా చేసారు.

అ— శరభయ్యబావ అప్పులుచేసాడా? అంతఖర్మమేంపట్టింది బావానీకు ?

శ— చేసాను అనంతయ్యా. అపారంగా అప్పులుచేసాను. ఖర్చుకు అలవాటుపడిన చేయిని వెనక్కు తీసుకోలేక — ఆడంబర జీవితాన్ని విడనాడలేక నా ఐశ్వర్యాన్నంతటినీ ఆహుతి చేయడమేకాదు, అప్పులుకూడా చేసాను అనంతయ్యా అప్పులుకూడాచేసాను.

హా— నాన్నన్ను మీరు అప్పులు చేయడమేఁవిటండీ? ఎందుకోసం?

గో— దానధర్మాలకోసం.

హా— ఎవరికోసం?

గో— కేవలం తనకోసమే. తన ఆత్మ సంతృప్తికోసం!

తి— శరభయ్యగారు ఎక్కడో అపర శిబిచక్రవర్తిలా వున్నారే? అప్పుచేసి మరీచేయాలా దానధర్మాలు?

శ— ఆకీర్తి మైకంలో నేనెంత నాశనమై పోతున్నానో నాకు అర్థంకాలేదు తిరుపతీ!

గో— తలకుమించిన ఖర్చులతో – అలవిమాలిన అప్పులు చేసి—చేతులు కాలినతర్వాత ఆకులు పట్టుకొన్నట్లుగా ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నారు శరభయ్యగారు.

అ— సాహసించి అడుగుతున్నందుకు మన్నించండి, బావగారూ. మీదగ్గర చాలావరకు రొక్కముండేదని విన్నాను. అది అంతా...

శ— హారతికర్పూరమైపోయింది.

తి— ఏమాత్రం అయిపోయిందంటారు?

శ— దాదాపు లక్షరూపాయలవరకు!

హా— ఓ మైగాడ్. లక్షరూపాయలే? ఇకమీవద్ద ఏమీ లేదా?

శ— లేదు.

అ— మరి మీ భూములు?

శ— తనఖాపెట్టబడ్డాయి.

తి— అన్నీనా?

గో— అన్నీను. ఇంటితోసహితంగా!

హ— ఈఇల్లుకూడా తనఖా పెట్టబడిందా?

చి— చాలా ఆశ్చర్యంగావుందే! ఇంతసొమ్మూ ఏంచేసారు తాతయ్యగారూ?

శ— ఏంచేసానని చెప్పను నాయనా? ఏదో అయిపోయింది.

గో— సమస్త సంపదా చేయిజారిపోయింది కనుకే ఈ ఇల్లు ఇంత శోభాహీనంగా వుంది. లేకపోతే ఏనాడైనా ఈ ఇల్లు నౌకర్లులేకుండా ఇంత నిర్జనంగా వుండేదా?

హ— ఇదేదో మాయగావుంది. ఈ ఇరవై ఏళ్ళలో మీఆస్తి నంతా పాడుచేసి, భూములూవుట్రా తనఖాపెట్టి, ఇంతగా అప్పులపాలయ్యారంటే నాకు నమ్మశక్యం కాకుండా వుంది. ఐ నెవ్వర్ బిలీవిట్.

అ— లక్షలాది ఆస్తి లక్కలా కాలిపోయిందంటే ఎవరు నమ్ముతారు చెప్పండి.

గో— మీరు నమ్మినా, నమ్మకపోయినా నిజమంతే.

తి— ఇందుకు రుజువేమిటి?

గో— మీకింకా రుజువేమిటండీ. ప్రస్తుతం శరభయ్యగారి భూములన్నీ అప్పులవాళ్ళ జప్తులో వున్నాయి. ఇక ఇప్పుడో, ఇంకాస్సేపటికో పాపయ్య ఈఇంటిపై కూడా జప్తు కువస్తున్నట్లు తెలిసింది. మీరందరూ శరభయ్య గారికి వారసులు. ఎలా ఆదుకొంటారో ఏమో. వారి

నీ ఆపదనుండిమాత్రం గట్టెక్కించి, వారి మర్యాద నిలపండి.

హా— మీరెంత చెప్పినా సరే, I never beleave it. శరభయ్యగారు అప్పులుచేసారనడం అబద్ధం.

గో— రుజువు కావాలా హాలుగారూ.

హా— Certainly.

గో— అయితే అప్పులవాళ్ళు శరభయ్యగారి కిచ్చిన ఈ నోటీసులు కొంచెం చిత్తగించండి. నిజం మీకే బోధపడుతుంది.

హా— (గోవిందయ్య ఇచ్చిన కాగితాలు పరిశీలిస్తాడు)

అ— ఏమిటి హాలూ, అంతా నిజమేనంటావా ?

తి— అప్పులకు పోగా ఆస్తి కొంతైనా మిగులుతుందా ?

గో— ఆస్తికి రెట్టింపు వున్నాయి అప్పులు.

హా— What a man. ఇంతకీ శరభయ్యగారూ, పిత్రార్జిత మైన ఈసొత్తునంతట్నీ తనఖాపెట్టడానికి మీకెవరిచ్చారండీ అధికారం ?

గో— అలా అడగవలసిన చెట్టంతకొడుకు చెంతనేలేడు.

తి— అయితేమాత్రం మేములేమా వారసులం ?

గో— మీరున్నారని అప్పులవాళ్ళకేం తెలుసు నాయనా ? తెలిస్తేమాత్రం మీ అభ్యంతరాలు పాటిస్తారా ?

హా— పాటించకపోతే ఊరుకొంటామా ?

గో— ఏమిటో మీపిచ్చి ! శతకోటి దరిద్రాలకు అనంతకోటి

ఉపాయాలు అన్నారు. శరభయ్యగారి సంపద ఏదో విధంగా పడవేసికోవాలనుకొన్న ఋణదాతలు మీ వంటి ఏదో దూరపు వారసుల అభ్యంతరాలు సరకు చేస్తారా ?

అ— సరకు చేయకపోతే కోర్టువారూరకొంటారా ?

గో— కోర్టులవరకూ పోగలిగినప్పుడుగదా అది తెలుస్తుంది. పోనీ, మీకంతవరకూ స్తోమతవుంటే— అలా చేసి చూడండి.

అ— (హాలువైపు ప్రశ్నార్థకంగా చూస్తాడు)

హా— (తిరపతివైపు ప్రశ్నార్థకంగా చూస్తాడు)

తి— మీమాటలు ఏమోకాని— ఇందుకోసం కోర్టులచుట్టూ తిరగడం నాకు అభిమతంకాదు.

అ— కోర్టుకెళితే తిరిగి ఆస్తి మనస్వాధీనం కాదంటావా తిరపతీ ?

తి— స్వాధీనమయినా, మానినా—ముందు కోర్టులకోసం ఖర్చు లెక్కడనుండి తెచ్చిపోయగలం ?

హా— అవును. That is a point. అయినా శరభయ్యా ఎంత దానధర్మాలు చేస్తేమాత్రం అంత కళ్ళుమూసుకు పోవాలా ?

అ— అప్పుచేసి మరీ చూపించాలా ఔదార్యం ?

తి— నీకొడుక్కు నీ ఆస్తిపాస్తులు ఈయకపోతే మాని. వారసులం మాకుకూడా నీఆస్తి దక్కకుండాచేయాలా?

హా— మమ్మల్నిలా "రూయిన్" చేయడానికి ఏం నీకేముప కారం చేసాం ?

భ— మామీద నీకెందుకీ అనవసరకక్ష ?

గో— అయిపోయినదానికి ఎన్ని అనుకొంటే ప్రయోజనముంది? ప్రస్తుతం మీరందరూ శరభయ్యగార్ని ఓదరికి చేరిస్తే బావుంటుంది.

భి— మమ్మల్నందర్నీ ఈదరికి చేర్చినందుకు...

అ— పాపం, వారినికూడా మనం ఓదరికి చేర్చాలి.

గో— పాపం, శరభయ్యగారు మీపై ఎంతో ఆశ పెట్టుకు వున్నారు.

హా— ఆస్తి తగలవేసినప్పుడు మేం గుర్తు లేకపోయాంకాని, అవస్థపడుతున్నప్పుడు మేం గుర్తుకొచ్చామా ?

గో— అయినవాళ్ళు మీరే ఇలాఅంటే పాపం శరభయ్యగారు ఏంచేయగలరు చెప్పండి.

అ— ఏంచేస్తే మాకెందుకు? ఉన్నప్పుడుఅంతా శెనగపప్పులా కర్చుపెట్టి, లేనప్పుడు మానెత్తి నెక్కుతాడా ?

భి— వళ్ళుగడిస్తే సరా? సిగ్గూ శరమూ వుండక్కర్లా?

గో— మీరు కాదంటే ఈనాడు ఆయన బ్రతుకు బజారున పడుతుంది.

హా— అందుకు మేమేంచేస్తాం? We can't help.

గో— అలాపడకుండా మీరు చూడాలి. ఈ ఇంటికోసం బాకీ దారుడు జప్తుకు రాకుండానే మీలో ఎవరో ఒకరు శరభయ్యగార్ని ఇక్కడనుండి దాటించి...

శ— నాజీవిత శేషాన్ని గడపవలసిందిగా కోరుకొంటున్నాను.

గో— ఇక శరభయ్యగారు బ్రతికినంతకాలం బ్రతకరు. కాబట్టి మీలో ఎవరో ఒకరుగాని, ముగ్గురూ కలిసిగాని వారి దక్కించుకోవలసిందిగా వేడుకొంటున్నాను.

అ— ఇంతవరకూ దానాలు పట్టినవాళ్ళున్నారుగా, వాళ్ళు ఆదరిస్తారు లెండి.

తి— అవునవును. ఇంతవరకూ తిన్నవాళ్ళే ఈయన్ని చూడక పోతే మేమెక్కడచూడగలం ?

హ— అసలు మానంటివాళ్ళం ఆయన్ని చూడమనేకదా ఆయన ఆస్తి అందరికీ ధారపోసాడు.

What a foolish man!

శ— మీరేమైనా అనండి. అసలు, వారసులు కావాలని నేను ప్రకటించిందే ఇందుకోసం! ఎవరోఒకరు వచ్చినా యీ అవసానదశలో తప్పకుండా ఆదుకొంటారని ఆశించాను.

తి— ఆహాహా.ఎంతో చక్కగావుంది.కలిమిలోనీకు వారసులు అక్కర్లేక పోయారుకాని—లేమిలో కావలసి వచ్చారా?

అ— బాబూ శరభయ్యబావా, నీకోనమస్కారం, నాసంసారాన్ని పోషించుకోలేక నేనేసతమతమవుతూంటే— నిన్ను నేనెక్కడ భరించగలను? నావల్ల కాదు.

శ— అనంతయ్యా, మీముత్తాతా, మాముత్తాతా స్వయానా బావా బావమరుదులు— నీవుకాదనక,

అ— ఆమాటకొస్తే– మీతాతా మాతాతా ఆమరణ విరోధులని నీవేచెప్పావుగా. నావల్ల కాదు.

శ— విరోధాలు బంధుత్వాన్ని వేరుచేస్తాయా అనంతయ్య బావా. నామాటవిను.

అ— అబ్బెబ్బే. నావల్ల కాదు.

శ— బాబూ తిరుపతీ, నీవైనా.

తి— ఏదో మీరిస్తే మీ పేరు చెప్పుకొని బ్రదుకుదామని నేను వచ్చానేకాని– మిమ్మల్ని పోషించడం నాకెక్కడ సాధ్యం.

శ— నీవలాఅనకు తిరుపతీ. నీవు మామామగారి తోడల్లుడికి స్వయానా వేలువిడిచిన తమ్ముడివి! నాకువరసకు మామ గారివికూడా అవుతావే, నీవేఇలాఅంటే ఎలా ?

తి— శరభయ్య గారు, నన్ను మొహమాట పెట్టకండి.

శ— నీవు నాకు హక్కుగల వారసుడివి కదా తిరపతీ. నీవు కాదంటే ఎలాచెప్పు.

తి— అదేంకుదరదు శరభయ్యగారు. మిమ్మల్ని పోషించడం నావల్ల కాదు.

శ— పోనీ హాలూ, మీఅమ్మకు నిన్ను నారెండో కొడుకుగా పెంచుకొంటానని మాటిచ్చాను కదా. పెంచుకోకపో యినా నీవునాకు కొడుకువంటి వాడవే. ఎవరికి తప్పినా నాబరువు నీకు తప్పదు.

హా— నాన్సెన్స్! శరభయ్యా. జోగీజోగీరాసుకొంటే బూడిద రాలిందంట. నీబరువు నాకూవద్దు, నాబరువు నీకూవద్దు.

గో— మీరంతా ఆయనవారసులు. కోర్టుకూడా. మిమ్మల్ని కాదనలేదుకదా. కాబట్టి ఆయన సంపదలాగే ఆపదలు కూడా పంచుకోవాలి.

తి— నీవున్నావుగా. నీవుపంచుకో. నావల్లకాదు.

అ— అబ్బెబ్బే. నావల్ల అసలేకాదు

హా— యూజ్ లెస్ ఫెల్లో! నాకు కుదరదు.

చి— తాతయ్యగారు. మీకభ్యంతరంలేక పోతే నేనో మాట చెప్తాను వింటారా?

శ— ఏమిటి?

చి— మీరంత బాధపడకండి. మీరు నాకూడా వస్తానంటే నేను మిమ్మల్ని పోషిస్తాను.

తి— ఏమిటి, నౌకరుగాడివి నీవా?

అ— ఈ శరభయ్యను పోషిస్తావా?

హా— నీకేమైనా మతిపోలేదుకదా? నాన్సెన్స్!

చి— మీరు "ఊఁ" అనండి తాతయ్యగారూ, మనమిప్పుడే ఇక్కడనుంచి వెళ్ళిపోదాం.

గో— నీవెలా పోషించగలవు చిరంజీవీ?

చి— ఎలా పోషిస్తే మీకెందుకు?

గో— అదికాదు నాయనా, నీపొట్టకే చాలక ఒకచోట నౌకరీచేస్తున్నావుకదా? నీవు వారినెలాపోషించగలవని.

చి— గోవిందయ్య గారూ, ఇంతబ్రతుకూ బ్రతికి ఒక్క తాతయ్యగార్ని పోషించలేనా? నాజబ్బల్లో సత్తువ

ఉన్నంతవరకూ వారి కేలోటూ రాకుండా చూసు కొంటాను.

శ— (కన్నులు చెమ్మగిలుతాయి. ఆప్యాయంగా) చి...రం ...జీ...వీ—

చి— మీరు కంగారుపడకండి తాతయ్యగారు. మీ ఆస్తి పాస్తులకే వారు వారసులుకాని— మీ ఆపదలకు వీరు వారసులుకారు. రండి, మిమ్మల్ని నేను ఆదుకొంటాను.

అ— "తాదూర సందులేదట! మెడకో డోలట!" అన్నట్టుగా వుంది నీతంతు!

తి— "మింగ మెతుకులేదట కానీ, మీసాలకు సంపెంగ నూనెట" ఎవడో నీబోటిగాడికే.

గో— మీరు శరభయ్యగార్ని ఆదరించరు సరికదా ఆదరిస్తా నన్న చిరంజీవినికూడా వెక్కిరిస్తారెందుకు ?

అ— వెక్కిరించడంకాదు, వాడి వెర్రి వెంగళాయితనాన్ని వెల్లడిస్తున్నాం.

చి— నాకు మీ రేమీ వెల్లడించనక్కర్లేదు. తాతయ్యగారూ నన్ను పరాయివాడనని భావించకండి. మిమ్మల్ని పువ్వుల్లోపెట్టి పోషించుకొంటాను.

గో— చిరంజీవీ, ఒకవేళ శరభయ్యగారివద్ద ఏదైనా ప్రత్యేక ఆస్తి వుందనుకొంటున్నావేమో, అదేం లేదుసుమా.

చి— పోనీలెండి, నాకు వారుకావాలి కాని వారి ఆస్తి ఎందుకు ?

శ— చిరంజీవీ— నా ఆరోగ్యం సరైనదికాదు. ఎప్పుడూ ఏదో జబ్బుచేస్తూనే వుంటుంది. వైద్యంకోసం చాలా శ్రమపడాలి సుమా.

చి— పరవాలేదు తాతయ్యగారూ.

గో— వారి మందులకూ, మాకులకూ, తిండికీ—తిప్పలకూ చాలా ఖర్చుపెట్టవలసి వుంటుందినుమా.

చి— ఖర్చుపేరుతో నన్ను భయపెట్టాలనుకొంటున్నారా, గోవిందయ్యగారూ. నా జీవిత సర్వస్వాన్ని అయినా ధారపోసి నేను తాతయ్యగారిని సంరక్షించుకొంటాను.

శ— (ఆనంద తన్మయత్వం) కాని...చిరంజీవీ...

చి— నేను మీకంటె... తక్కువ కులంవాడినని తటపటా యిస్తున్నారా తాతయ్యగారూ. అదొక్కటే నేను చేసికొన్న దురదృష్టం.

శ— కాదు చిరంజీవీ, కాదు. నీవేకులానికి చెందినా నీగుణం నన్ను ముగ్ధుణ్ణి చేసింది చిరంజీవీ, నన్ను ముగ్ధుణ్ణి చేసింది.

గో— చిరంజీవీ— కులానికి నీవు తక్కువేకావచ్చు. కాని గుణం లో, సహృదయతలో నీవు మమ్మల్నందర్నీ మించి పోయావు.

శ— చిరంజీవీ, ఇకమీదట కొడుకువైనా, మనవడవైనా నీవే. నీకీ క్షణంలోనే నా సర్వస్వం వ్రాసిపారవేస్తాను.

గో— కొంచెం ఆలోచించండి శరభయ్యగారూ.

శ— ఇక ఆలోచన నాకనవసరం. పత్రికలో ప్రకటుచేసినా-నాచెంతకు రాని కొడుకు నాకున్నా, లేకున్నా ఒకటే. ఇకమీదట చిరంజీవే నాకొడుకు గోవిందయ్యా, నీవు ప్లీడర్ని పిలు. నా ఆస్తిపాస్తులన్నీ ఇప్పుడే చిరంజీవికి రాసివేస్తాను.

అ— ఆస్తిపాస్తులు లేవన్నారుగా ?

తి— అప్పుల్లోనే వున్నామన్నారుగా ?

హో— అన్నీ అబద్ధమేనా ?

శ— అవును, అన్నీ అబద్ధమే. వారసులమంటూ వచ్చిన మిమ్మల్ని పరీక్షించేందుకు ఈ అబద్ధాలాడవలసివచ్చింది. నా ఆస్తిని అనుభవించగలరుగానీ— నన్ను ఆదరించ లేరా మీరు? మీవంటి పయోముఖ విషకుంభాలకు నాఆస్తి నివ్వడం పాపంకూడా.

హో— ఆరి ముసలిపీనుగా, ఎంతనాటకమాడావురా ?

చి— ఏయ్ హోలూ, మాటలు తిన్నగా రానీయ్.'

హో— ఆస్తి ఇచ్చేస్తున్నాడని అప్పుడే అజమాయిషీ చెలా యిస్తున్నావే ?

శ— గోవిందయ్యా, ముందు ఈముగ్గురు వెధవల్ని బైటికి పంపించు.

అ— నన్ను "వెధవ" అంటావా బావా? నీకు మర్యాదగా వుందా ?

తి— తను "వెధవ" కాబట్టే మనల్ని "వెధవ" లంటున్నాడు.

హా— శరభయ్యగారూ, ఇంతకూ మీఆస్తి ఈ కులంతక్కువ వానికి ఇచ్చివేస్తారా ?
శ— లేకపోతే నీవంటి సన్నాసికి ఈయమన్నావా ?
హా— ఎలా ఇస్తారో చూస్తాగా. ఇందుకు చట్టంవప్పుకోదు.
శ— ఒప్పుకోకపోతే పోయి కోర్టులో దావా పడేసుకో. నా ఇష్టంవచ్చింది నేను చేసితీర్తాను.
అ— ఇది నీకు న్యాయంగా వుందా ?
తి— అయినవాళ్ళం మేముండగా ఎవరో అనామకుడికి నీ ఆస్తి ధారపోస్తావా ?
శ— (క్రోధంగా) తిరుపతీ ?
హా— అందులోనూ నీవారసులమైన మమ్మల్నందర్నీ అవమానిస్తావా ? It is a great insult for us.
శ— మీరా నాకు వారసులు ? నేను జీవించివుండగా నా ఆస్తిపాస్తులు మీకు దక్కవని, వైద్యం పేరుతో విషాన్నిచ్చి నాప్రాణాలు తీయ సంకల్పించిన మీరు నాకు వారసులా ?
తి— మేం ఇచ్చింది విషమైతే నీవెలా బ్రతికివున్నావు శరభయ్యా ?
శ— చిరంజీవి నన్ను రక్షించాడు గనుక.
అ— అనవసరంగా మమ్మల్ని నిందించకు బావా.
శ— అనంతయ్యా, అడ్డంగా మాట్లాడకు. నేను తల్చుకొంటే ఈనాడు మిమ్మల్నందర్నీ చెఱసాలలో పెట్టించగలను. కాని నాకా సంకల్పం లేదు. మీరు వెంటనే పొండి.

హా— ఎంత ఇదయితేమాత్రం మీఆస్తి ఒక నౌకరుగాడి కిస్తారా ? It is gently wrong.

శ— నాఇష్టంవచ్చినవాళ్ళ కిస్తాను. మధ్య నీవెవడవోయ్, నన్నడగడానికి ?

చి— నాకు మీఆస్తి అక్కర లేదండీ.

గో— మరి ఏంకావాలి ?

చి— తాతయ్యగారు ఏదో ఆపదలో వున్నారనుకొని వారిని ఆదుకొందామనుకొన్నాను. అంతేకాని, వారి ఆస్తి నాకెందుకు ?

శ— చిరంజీవీ— నీవు వద్దన్నా నేను వ్రాయకమానను.

హా— అంత వద్దనేవాళ్ళకు ఆస్తివ్రాస్తే పాపం శరభయ్య గారూ. పోనీ మాకు వ్రాసివేయండి.

శ— ఇదుగో గోవిందయ్యా ముందు వీళ్ళను బైటకుపంపించు.

గో— బాబూ ఇక దయచేస్తారా మరి ?

అ— దయచేస్తాం, దయచేస్తాం. నీవూ, శరభయ్యా కలసి మమ్మల్నింత దగా చేస్తారా ?

తి— ఆ శరభయ్యకు బుద్ధిలేకపోతే మానె— నీకెలా లేకపో యిందయ్యా గోవిందయ్యా ?

హా— ఇదిగో శరభయ్యగారూ, నేనో మాట చెప్తాను వింటారూ ?

శ— నేను వినను. సరా? వెళ్ళు.

హో— అదికాదండి.

శ— ఏదికాదు. నేను నీమాటవినదల్చుకోలేదు.

హో— పోనీ మీరు చిరంజీవికి ఆస్తి ఇవ్వాలనుకొంటున్నారు కాబట్టి అలానే కానివ్వండి.

శ— ఊఁ

హో— అతనితోపాటు నాకుకూడా...

శ— ఒక వాటా పెట్టమంటావు అంతేనా ?

అ— బావా, నన్ను మర్చిపోవడం భావ్యంకాదు.

తి— ఎందుకు శరభయ్యగారూ, మీకూ మాకూ పేచీ. మీ ఆస్తిని మా నల్గురికీ వ్రాసివెయ్యండి.

చి— తాతయ్యగారూ, మీఆస్తిపై నాకెంతమాత్రం ఆశ లేదు. దానిని నాకుతప్ప మీ ఇష్టంవచ్చినవాళ్ళకు ఇచ్చుకోండి.

శ— ఇదిగో చిరంజీవీ, నీవే నా నిజమైన వారసుడివి. ఈ వారసత్వాన్ని కాదంటే నేనొప్పుకోను. తెలుసా?

గో— తొందరపడకండి శరభయ్యగారూ. ఒకవేళ మీ అబ్బాయి చంద్రం తిరిగివస్తే...?

శ— తిరిగివస్తేనా? తిరుగుముఖం పట్టమంటాను. ఈ ఇరవై ఏళ్ళ పుత్రవియోగంతో నా హృదయం ఎంతగా అట్టుడికిపోయిందో ఎవరికి తెలుసు? ఇంతకాలం ఈ నా దుఃఖాన్ని అర్థంచేసుకోలేని చంద్రం తిరిగివస్తే నేం! రాకపోతే నేం? ఇన్నాళ్ళూ లేని కొడుకు ఇకమీదట

కూడా లేడనుకొంటాను. కాని చిరంజీవీ నన్ను దగా చేయకు సుమా. ఈ స్థితిలో నన్ను వదలి ఎక్కడకూ వెళ్ళకూడదు.

చి— వెళ్ళను తాతయ్యగారూ. మిమ్మల్ని వదలి నేనెక్కడకూ వెళ్ళను.

అ— శరభయ్య బావా !

శ— అనంతయ్యా, నన్ను విసిగించకు. పోండి! వెంటనే వెళ్ళిపొండి. లేదా మిమ్మల్ని పోలీసులకు అప్పగిస్తాను.

తి— అయ్యబాబోయ్! పోలీసులెందుకు! మేమేపోతాం లెండి.

హా— శరభయ్యా, Don't play with me. నేను చాలా ప్రమాదకరమైన వ్యక్తిని.

శ— ఏంచేస్తావేం?

హా— నీవు నీఆస్తి ఈనౌకరుగాడికిస్తే ఎంతమాత్రం చెల్లదు.

అ— అవును ఎంతమాత్రం చెల్లదు.

శ— మీరు మర్యాదగా ఇక్కడనుంచి పోతారా? పోలీసుల్ని పిలవమన్నారా?

తి— (కంగారుగా) హాలూ! పోలీసుల్ని పిలుస్తాడట! పద పోదాం.

హా— I shall see you శరభయ్యా? I shall see you. నీవు ఈ నౌకరుగాడికి ఆస్తి నెలా ఇస్తావో చూస్తాము. నిన్ను కోర్టుకీడ్చి ముప్పతిప్పలు పెట్టకపోతే– My name is not Hal. I shall me your end. (అంటూ హాలూ, అనంతయ్యా, తిరుపతీ బయటకు చురుకుగా నిష్క్రమిస్తారు)

శ— అమ్మ— పీడవదలింది! గోవిందయ్యా, ఇంకా నిలబడి వున్నావేమయ్యా? వెంటనే ప్లీడరుని పిలుచుకురా.

గో— శరభయ్యగారూ ఆవేశంలో మీకు మీరు అన్యాయం చేస్తున్నారేమో ఒక్కసారి ఆలోచించండి.

శ— నేనన్నీ ఆలోచించాను. ఇక నాకెదురు చెప్పకు. వెంటనే వెళ్ళి పిలుచుకురా.

గో— సరే. వెళతాను (వెళ్ళబోతాడు)

చి— గోవిందయ్యాగారూ, ఆగండి.

శ— గోవిందయ్యగారూ మీరు వెళ్ళండి.

చి— ఆగండి గోవిందయ్యగారూ.

శ— వెళ్ళండి గోవిందయ్యగారూ.

గో— (వెళ్ళనూ లేక, ఆగనూ లేక రగం ఒకచివర నిలిచి పోతాడు)

చి— తాతయ్యగారూ ఒకమాట చెప్తాను వింటారా?

శ— ఒక్కమాట కాదుగదా, సగం మాటకూడా వినిపించుకోను.

చి— ఇప్పుడు ప్లీడర్ని పిలిపించడం అనవసరం తాతయ్యగారూ.

శ— నీకు తెలియదు చాలా అవసరం.

చి— అబ్బే అవసరం లేదండి.

శ— ఎందుకవసరం లేదు?

చి— మీరు రాయకపోయినా ఆ ఆస్తి నాకేవస్తుంది కాబట్టి

శ— ఏమిటీ?

గో— కొంపతీసి నీవుకూడా ఒకవారసుడివా ఏం శరభయ్య గారికి ?

చి— అవును గోవిందయ్యగారూ ?

గో— ఏవిధంగా ?

చి— నేను శరభయ్యగారికి స్వయానా మనవడిని.

గో— అంటే ?

చి— చంద్రంగారి అబ్బాయిని.

గో— దాదాపు ఇరవై ఏళ్ళక్రితం చంద్రం మమ్మల్ని వదలి వెళ్ళాడు ఇంతవరకూ ఎలా వున్నదీకూడా తెలియదు. నిజంగా నీవతని బిడ్డవేనా చిరంజీవి ?

చి— మీకూ నమ్మకం చిక్కలేదా గోవిందయ్యగారూ ? అయితే చూడండి. ఇది మానాన్నగారి గొలుసు. ఇది మొన్న నా పుట్టినరోజున మా నాన్నగారు నాకు బహూకరించారు. ఇది తనకు మా తాతగారు చిన్న తనంలో పెట్టారనీ, భద్రంగా ఉంచుకోమని చెప్పారు. (అంటూ మెడలోవున్న ఒక బంగారుగొలుసు చొక్కా తొలగించి చూపిస్తాడు. శరభయ్య ఆదుర్దాగాచూసి ఆనందం ప్రకటిస్తాడు)

శ— ఇది మా చంద్రం గొలుసే గోవిందయ్యా. వాడి చిన్న తనంలో చేయించాను. హారి పిడుగా, అయితే నీవు నాదగ్గర నౌకరీ చేయవలసిన కర్మమేంపట్టిందిరా ?

చి— మా నాన్నగారు చేసిన పనికి — నేను మామూలుగా

వస్తే నన్ను ఆదరించ రేమోనని — ఈనౌకరీ మిషతో వచ్చాను.

గో— అయితే మీ తాతగార్ని బాగానే బుట్టలోవేసావ్ !

శ— ఒరేయ్ చిరంజీవీ ఇరవై ఏళ్ళకు ఇప్పుడు ఈవూర ఒక తాత వున్నాడని నీకు గుర్తొచ్చిందట్రా ?

గో— చంద్రం ఎలావున్నాడు బాబూ ?

చి— కులాసాగానే వున్నారు.

శ— ఒరేయ్. మీనాన్న పాడుపని చేస్తేచేసాడు కాని, రత్నంవంటి నీలాంటి మనవణ్ణి నాదగ్గరకు పంపించాడు. దీనితో వాడిపాపం పటాపంచలై పోయిందని చెప్పరా.

గో— ఓహో ! అసలుకంటె వడ్డీ ముద్దు అన్నట్లుగా మీకు అబ్బాయికంటె మనవడు ముద్దయిపోయాడులావుంది.

శ— ఇదిగో గోవిందయ్యా, నేను మాటంటే అలాజరిగి తీర వలసిందే. అబ్బాయికి పూచికపుల్ల ఆస్తి ఈయన న్నాను. ఈయను. అంతే. అంతా మా చిరంజీవికే ఇచ్చివేస్తాను. చంద్రం ఏ గంగలో దిగినాసరే.

గో— మీ అమ్మగారు బాగున్నారా నాయనా ?

చి— బాగానే వున్నారు.

గో— మీనాన్నగారిప్పుడెక్కడున్నారు నాయనా ?

చి— చెన్నపట్నంలో వున్నారు, గోవిందయ్యగారూ.

శ— అక్కడ ఏమిటి అఘోరిస్తున్నాడు ?

చి— ఒక దినపత్రికలో సంపాదకులుగా పనిచేస్తున్నారు, తాతయ్యగారూ.

గో— అయితే చిరంజీవీ, మీ తాతయ్యగారిలా ప్రకటన ఇచ్చిన సంగతి అతనికి తెలుసా? తెలియదా?

చి— తెలుసండి. మా తాతయ్యగారిచ్చిన ప్రకటన పత్రికల్లో ప్రచురించబడే ముందు మా నాన్నగారి చేతుల్లోకే వస్తుంది. ఆ సంగతి వారు మా అందరితో చెప్పారు. మా అమ్మగారు మా నాన్నగార్ని వెళ్ళి తాతగార్ని చూసిరమ్మని ఎంతో ప్రతిమాలింది. కాని ఆయన వినిపించుకోలేదు.

శ— నాకు తెలుసు. వాడు వినిపించుకోడు.

చి— ఇప్పుడు వెళ్ళినట్టయితే ఏదో ఆస్తికోసం వెళ్ళినట్లుంటుంది. నేను వెళ్ళనుగాక వెళ్ళను పొమ్మన్నారు.

శ— అంటాడు అనడుమరీ ఈఇరవై ఏళ్ళు నేనుపడిన ఆవేదన వాడికేం తెలుసురా?

చి— పోనీ నేను వెళ్ళిరానా నాన్నగారూ, అన్నాను. కాని నన్నుకూడా వద్దన్నారు.

శ— వద్దన్నాడూ దుర్మార్గుడు! ఇప్పుడు నాయెదుట ఉండవలసింది పీక పిసికివేద్దును!

చి— అప్పుడు మా అమ్మగారు— "వారిఆస్తి మనకక్కర్లేదు. పోనీ వారెంత అవస్థ పడుతున్నారో ఒకసారి చూసి రానీయమని, నన్ను పంపించమని" నచ్చచెప్పగా కడకు మానాన్నగారు "సరే" నన్నారు. కాని నన్ను నాబంధుత్వాన్ని మాత్రం తెలియనివ్వకుండా జాగ్రత్త

గా వెళ్ళి వచ్చివేయమని ఆజ్ఞాపించారు. కాని ఇక్కడ పరిస్థితులనుబట్టి విధిలేక నాబంధుత్వం వెల్లడించుకోవలసి వచ్చింది.

శ— మంచిపనిచేసావు. ఇదిగో చిరంజీవి ఒక్కటిచెప్తున్నాను విను. నీవు మీ నాన్న మాటలువిన్నావా ఇక నీవు నీజీవితంలో బాగుపడలేవు.

గో— శరభయ్యతాతగారి మాటలు విను నాయనా బాగు పడతావు. అయినా శరభయ్యగారూ నాకు తెలియక అడుగుతాను; మీకు కొడుకు పనికిరాడు కాని మనవడు పనికివస్తాడా ?

శ— ఆఁ ! పనికివస్తాడు !

గో— శరభయ్యగారూ మీరు మర్చిపోయారేమో, మీ అబ్బాయి పెండ్లాడిన అమ్మాయి ఒక క్రైస్తవకన్య. మన మతంకాని, కులంకాని అమ్మాయి. ఆ అమ్మాయికీ మీ అబ్బాయికీ పుట్టిన...

శ— బిడ్డే వీడు ! నాకు తెలుసు.

గో— శరభయ్యగారూ.

శ— ఆశ్చర్యపడుతున్నావేం గోవిందయ్యా.

గో— మీలోని పరివర్తన...

శ— నీకు ఆశ్చర్యం కలిగిస్తుంది కదూ.

గో— అవును.

శ— చిరంజీవి మంచితనం నన్ను వివశుణ్ణి చేసివేసింది గోవిందయ్యా, వివశుణ్ణి చేసివేసింది.

గో— నేను మీలో చూస్తున్నది వినశత్వం కాను, శరభయ్యగారూ.. ఒక బ్రహ్మాండమైన పరివర్తన. అర్థంలేని సాగే తన సాంప్రదాయాలతో సంకుచితమైపోయిన మీ హృదయంలో అభ్యుదయపు భావాల వెలుగులు చూస్తున్నాను. మతంకంటె, కులంకంటె మానవత్వం మహోత్తమమైనదని మీరు గుర్తించారు. నాకు చాలా ఆనందంగావుంది శరభయ్యగారూ. చాలా ఆనందంగావుంది.

చి— మీకు కోపంరాదంటే నేనొకమాట చెప్తాను వింటారా తాతయ్యగారూ.

శ— చెప్పరా నీమాటవినక ఎవరిమాట వింటాన్రా? చెప్పు.

చి— క్రిస్టియన్ మతంలో పుట్టినంతమాత్రాన — మా అమ్మ అవినీతిపరురాలేం కాదు, తాతయ్యగారూ. అందరు ఆడవాళ్ళలా తన మామగార్ని సేవించుకొనే భాగ్యం తనకు లేనందుకు నిత్యమూ బాధపోతూవుంటుంది. పోనీ మీకు ఇష్టంలేకపోతే తిరిగి ఇక్కడకు వచ్చివేయవచ్చు ఒక్కసారి మా ఇంటికి రారూ?

గో— అవశ్యం వెళ్ళిరండి శరభయ్యగారూ. మంచితనాన్ని మానవత్వాన్ని మనం పూజించాలి గాని కులాన్నీ మతాన్ని కాదు. అనంతయ్యా, తిరుపతీ, పాలూ మీ కులస్థులు అయినంత మాత్రాన వీళ్ళ స్వభావాలకు మీరు వారిని ద్వేషించకుండా వుండగలిగారా?

బంధుత్వం తెలియక పోయినా - తక్కువకులం వాడిన న్నా - చిరంజీవిని మీరు ప్రేమించకుండా వుండగలిగారా ? మానవులు భగవంతుని చేరే మార్గాలుగా భావించినట్లయితే- అన్ని మతాలూ సమానమే వృత్తి విభజనరీత్యా ఏర్పడిన వర్గాలుగా భావించుకొంటే - అన్ని వర్గాలూ సమానమే, మతాల్లో హెచ్చు తగ్గులు లేవుగాని హెచ్చుతగ్గులున్నదల్లా మానవుల్లోనే యేమతానికి చెందినా - ఏకులానికి చెందినా - మంచివారు పూజనీయులూ - చెడ్డవారు వర్జనీయులూ అవుతారు. వెళ్ళండి. శరభయ్యగారూ, మీరు తప్పకుండా చిరంజీవితో వెళ్ళండి. కాని మమ్మల్ని మాత్రం మర్చిపోకండి.

చి:- వెళదాంరండి తాతయ్యగారూ, ప్రయాణం కట్టండి.

శ:- తప్పదంటావా చిరంజీవీ?

చి:- తప్పదు.

శ:- సరే వస్తానుకాని, చంద్రం మొహం మాత్రం నేను చూడను, తెలుసా?

గో:- ఆబెట్టుసరి కాస్తా ఇక్కడే చిరంజీవి. తీరా అక్కడకు వెళ్ళిన తర్వాత ఆతండ్రి కొడుకులిద్దరూ ఒక్కటే.

చి:- తాతయ్యగారూ ప్రయాణానికి సరంజామా సిద్ధం చేయమంటారా? (అంటూ లోనికి వెళతాడు)

శ:- నీచిట్కా మా భలేగా పని చేసింది గోవిందయ్యా.

గో:- ఈ చిట్కావల్ల మీ వారసులు వదలిపోవడమే కాదు. మీ అసలు వారసుడు కూడా బైటపడ్డాడు.

శ:- ఇంతకూ గోవిందయ్యా, జీవితంలో ఓడిపోయింది యెవ రంటావు? నేనా? చంద్రమా?

గో:- అది మీరే తేల్చుకోండి. శెలవు. (అంటూ వీధివైపు నిష్క్రమిస్తాడు)

శ:- ఇంతకూ జీవితంలో ఓడిపోయిందెవరు? నేనా? చంద్రమా?

(అని అనుకొంటుండగా చురుకుగా తెర)

—: మంగళం :—

# సవరణా పట్టి.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 6 వ పంక్తి వదలి వేయువలెను. | | |
| 8 | 22 | అల్పజ్ఞులమైల | అల్పజ్ఞులమైన |
| 20 | 7 | కావరసిన | కావలసిన |
| 28 | 21 | క్రింతం | క్రితం |
| 30 | 17 | అనకంటి | అనకండి |
| 36 | 12 | మీకు | మీరు |
| 37 | 20 | విరోధాలు బంధుత్వాన్ని తెచ్చి | విరోధాలు ఉన్న బంధుత్వాన్ని ఊడ్చి |
| 45 | 15 | కాలీనా సత్య | కాలీన సత్యం |
| 50 | 2 | Don't like | I don't like |
| 53 | 22 | పోవడిమేం | పోవడమేం |
| 68 | 13 | నీవెటువాడ | నీవెటువంటివాడ |
| 81 | 17 | టిక్ట్ | టికెట్ |
| 100 | 2 | gently | utterly |
| 102 | 22 | I shall me | I shall see |